349



సాహిత్య మాసపత్రిక

# స్రవంతి

* డా॥ ఇలపావులూరి పాండురంగారావు
* దాశరథి
* సోమసుందర్
* డా॥ టి. మోహన్‌సింగ్
* తూములూరి పార్థసారథి
* మహీధర రామమోహనరావు
* డా॥ దివాకర్ల వెంకటావధాని
* తుమ్మల రామకృష్ణ



ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖామాత్యులు శ్రీ పూసపాటి ఆనందగజపతిరాజుగారు
పంచాయతీ రాజ్య మంత్రి శ్రీ కరణం రామచంద్రరావుగారు హిందీ ప్రచార
సభలో ప్రసంగిస్తున్నారు.



# సాహిత్య మాస పత్రిక

# 349

మే, 1983

సంపుటి : 80, సంచిక : 2

వార్షిక చందా : పది రూపాయిలు

విడిప్రతి : ఒక రూపాయి

సంపాదకులు :

వేమూరి రాధాకృష్ణమూర్తి

# ఈసంచికలో

సంపాదకీయం :

# ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం - త్రిభాషా సూత్రం

ఆంధ్ర ప్రదేశ్‌లో తెలుగుదేశంపార్టీ అధికారంలోకి వచ్చినప్పటినుంచి భాషాబోధన గురించి రకరకాల అభిప్రాయాలు ప్రచారంలోకి వచ్చాయి. ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావుగారు ఢిల్లీలో త్రిభాషా సూత్రాన్ని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం పాటిస్తుందని ప్రకటించినప్పటికీ ఆచరణలో మార్పులు వస్తాయేమోనని కొందరు సందేహించడం జరిగింది,

ది-2 ఏప్రిల్ 1988 నాడు దక్షిణభారత హిందీ ప్రచారసభ, ఆంధ్రశాఖ భవనంలో పంచాయతీరాజ్య శాఖామంత్రి శ్రీ కరణం రామచంద్రరావుగారి అధ్యక్షతన జరిగినసభలో ప్రసంగిస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖా మాత్యులు శ్రీ పూసపాటి ఆనందగజపతిరాజు గారు తమ ప్రభుత్వం త్రిభాషా సూత్రాన్ని అమలు బరుస్తుందని స్పష్టంగా ప్రకటించారు. ఆంధ్ర ప్రదేశ్‌లో తెలుగు భాషకు ప్రముఖస్థానం లభిస్తుందని, అవసరాలను ప్రాముఖ్యాన్ని బట్టి ఇంగ్లీషుకు మహత్తరమైన స్థానం లభించక తప్పదని అంటూ పై రెండుభాషలకు లభించినంత ప్రాధాన్యం హిందీభాషకు కూడా ఆంధ్రప్రదేశ్‌లో లభిస్తుందని ప్రకటించారు. మూడుభాషలు నేర్చుకొనడంవల్ల తెలుగు బిడ్డల భవిష్యత్తు ఉజ్వలంగా వుండగలదని ఆశాభావం ప్రకటించారు. త్రిభాషా సూత్రాన్ని అమలు బరచడంలో యిప్పుడు కలుగుతున్న కొన్ని ఇబ్బందుల్ని తప్పక తొలగించడం జరుగుతుందని కూడా ఉద్ఘాటించారు.

విద్యాశాఖామాత్యుల విస్పష్ట ప్రకటనకు దక్షిణభారత హిందీ ప్రచారసభ హర్షం ప్రకటిస్తున్నది. హిందీభాషాబోధనకు యిప్పుడు స్కూళ్ళలో కేటాయించబడిన పీరియడ్లు సంతృప్తికరంగాలేవనీ, వాటిని పెంచాలనీ, ఉపాధ్యాయులు ట్యూషన్లు చెప్పకూడదని ప్రభుత్వం చేసిన నిర్ణయం దక్షిణ భారత హిందీప్రచారసభ, ఆంధ్ర ప్రదేశ్ యందంతట నడుపుతున్న ఉచిత హిందీ తరగతులు విజయవంతంగా నడిపించే హిందీ ఉపాధ్యాయులకు వర్తించనీయవద్దని విద్యాశాఖా మాత్యులకు ఆంధ్రశాఖకు చెందిన పెద్దలు మనవిచేసినప్పుడు విద్యాశాఖా మంత్రి అనుకూలంగా అభిప్రాయాల్ని వెల్లడించడమేగాక సభకు తప్పక సహకరిస్తామని మాటయిచ్చారు.

ఈ సందర్భంలో దక్షిణభారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర శాఖక్రింద తెలిపిన అయిదు లక్ష్యాలు సాధించేందుకు కృషిచేస్తుందని మనవి చేస్తున్నాం.

1. ఆంధ్రప్రదేశ్ స్కూళ్ళ లో త్రిభాషాసూత్రాన్ని సక్రమంగా అమలుబరుచుటకు కలుగుతున్న ఇబ్బందుల్ని తొలగించేందుకు ప్రభుత్వానికి సహకరించుట.

2. ఈశ్వరభాయి పటేల్ కమిటీ రిపోర్టు ప్రకారం ఆంధ్ర ప్రదేశ్ స్కూళ్ళ లో భాషా బోధనకు ముఖ్యంగా హిందీభాషాబోధనకు తగ్గించబడిన పీరియడ్లను పెంచుటకు ప్రయత్నించుట.

3. శ్రీ వెంగళరావుగారి ప్రభుత్వ సమయంలో విద్యాశాఖామాత్యుల అధ్యక్షతన ఏర్పాటు చేయబడిన హిందీ సలాహ్‌కార్ సమితిని పునరుజ్జీవింప చేయుట.

4. ఆంధ్ర ప్రదేశ్‌లోగల ప్రతిస్కూలులోను హిందీ ఉపాధ్యాయుల నియామకం జరుగుటకు కృషిచేయుట.

5 దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర పక్షాన ఆంధ్ర ప్రదేశ్ యందంతట నడుస్తున్న ఉచితహిందీ తరగతులలో సేవాభావంతో హిందీభాషాబోధన చేస్తున్న హిందీ ఉపాధ్యాయులకు ఆంధ్ర ప్రభుత్వంవారు జారీచేసిన ట్యూషన్ నిషేధపు ఉత్తరువు అమలు కాకుండా చేయుట.

పై లక్ష్యసాధనకు ఆంధ్ర ప్రదేశ్‌లో అకుంఠితదీక్షతో జాతీయ భాషా ప్రచారానికి పూనుకొని పనిచేస్తున్న పదివేల మంది హిందీ ఉపాధ్యాయుల మరియు హిందీ ప్రచారకుల సహకారాన్ని దక్షిణభారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర పక్షాన అర్థిస్తున్నాం.

-:o:-

# ఉగాది పచ్చ

డా॥ ఇలపావులూరి పాండురంగారావు

ఉగాది పచ్చడి అనాదిగా యుగయుగాల రుచులకు పునాది అయినది
ప్రభవ విభవలెన్నో పరికించిన పరబ్రహ్మమయ పదార్థనిధి యిది
ఆరు రుచుల ఆమ్నాయము జగమని నోరూరించెడి సుధల కడలి యిది
ఉప్పు పులుపులకు తీపి చేదులకు ఒగరు పొగరులకు ఉనికిపట్టు యిది
సకల రుచులు సహజీవన పాఠము శాంతియుతముగా సాధించుటనిది
షడ్రస షడృతు షట్చక్రములకు సమరస సరస రసాయనమయినది
ఉగాది పచ్చడి అనాదిగా యుగయుగాల రుచులకు పునాది అయినది
జీవితమే ఒక ఉగాది పచ్చడి చేదులోనె నానా రుచులున్నవి
వేపపూత జీవిత పరమార్థము చూపుల కది సుకుమారము సూక్ష్మము
అణువులలో పరమాణువయ్యె నఖిలాండకోటి నలరించి మించునది
చెట్టు చివర చిరు రెమ్మల చాటున చిద్విలాసమును చిందుచు మురియును
నా తావును కనుగొన్న వారికిల ఏ తావులు రుచియించవు తీయని
ఉగాది పచ్చడి అనాదిగా యుగయుగాల రుచులకు పునాది అయినది
ఇందులో శ్రీముఖములున్నవి యిందె బహుధాన్యములు నున్నవి
సౌమ్యసాధారణములున్నవి సర్వధారి విధాతలున్నవి
శుక్ల నందన జయవిజయములు శోభకృత్వ్యయ పరాభవములు
భావయువ కీలకములున్నవి హేవళంబి విళంబి శార్వరి
దుందుభిధ్వానమ్ములున్నవి దురిత రుధిరోద్గారు లున్నవి
రక్త నయనోల్లాసమున్నది ప్రజోత్పత్తికి ఆశలున్నవి
ఇది ఉగాది పరమార్థం పచ్చడిలోని పదార్థం
ఈ పచ్చడి ఈ జగతికి వేపప్రసాదము నిచ్చును
వేములోని చేదు విరిగి వేమనగా మారినచో
లేమి కలిమిగా మారును లేదన్నది లేకుండును
ప్రతి జీవికి సహజీవన పరమార్థము తెలియవలెను
సత్యధర్మ శాంతిసహన సమతమమత అలవడవలె
పువ్వులవలె నవ్వుచు మన పుడమి కడుపు పండవలెను
ఉగాది పచ్చడి అనాదిగా యుగయుగాల రుచులకు పునాది అయినది,

# అయోధ్యతో సయోధ్య

ఉర్దూ మూలం :
శ్రీ కుమార్ పాషీ

అనువాదం :
డాక్టర్ దాశరథి

అయోధ్యతో నా సయోధ్య
అనాది;
అయోధ్య నా జీవితానికి
పునాది ;
అయోధ్యానగరీ జననీ జఠరాంకురాన్ని నేను;
అయోధ్యా !
నీ ఒడిలో పెరిగినవాణ్ణి
నీ ఒడిలో చదివిన వాణ్ణి
అందుకే నీ కోసం ఇంత కాలానికి వస్తున్నాను
యుగ యుగాల నీ పునీత పురాతన మృత్తికలో
ఆడుకున్నాను; పాడుకున్నాను;
నాకు తెలుసు-నీ మట్టిలో
యేదో అనిర్వచనీయమైన వేదనవుంది;
నాకు తెలుసు-నాలో నీ కోసం కలకాలపు
తపన వుంది;
మన ఇరువురి అదృష్టంలో
ఆనందంపాలు తక్కువ
ఆవేదనపాలు ఎక్కువ
ఎంతకాలమైందమ్మా! నీహృదయ మాధుర్యాన్ని చవిచూచి!
ఎంతకాలమైందమ్మా! నీగృహ ప్రాంగణాన
రంగవల్లికలను అల్లే
బంగారు నీరెండలో స్నానంచేసి?
ఎంతకాలమైందమ్మా!
నీ నగరో పరిభాగాన అభివ్యాప్త
నీల గగనతలాన నిశాసమయాన

మిలమిలమెరిసే లక్షోపలక్ష
నక్షత్రమాలలు చూసి!
నీ రాజ పథాలు,
రాజ పథాలమీద రథాలు,
వీధులూ, వాడలూ
సందులూ, గొందులూ
అంబరచుంబిసౌధాల
అత్యున్నత శిఖరాలుచూసి
యెంతకాలమైందమ్మా!
అయోధ్యా!
ఉచ్ఛస్థితిలోవున్న ఆనాటి నీ ముఖారవింద సుందర శోభ
అక్షిగోచరం చేసుకుని యెంతకాలమైందమ్మా!
తల్లినుండి తప్పిపోయిన పిల్లవాడిలా
నీ నుండి తప్పిపోయిన నేను చూసిన దృశ్యాలన్నీ
శిశిరశీర్ణ, శిథిలాటవులు;
నేను చూసే ప్రతి దృశ్యం వెనక
యెన్నో అస్పష్ట దృశ్యాలు—
అతి ప్రాచీన శీర్ణ, జీర్ణ, జర్జరిత
నాగరికతా కేంద్రాలు
స్వప్న ప్రపంచాలు
జ్ఞాపకాల రూపకాలు;
ఇవాళ నా నయన గోళాలముందు అంధకారం;
కాని నా అంతరంగంలోమాత్రం తారావళిహారం
ఒకచోట గోకులరాధ
ఒకచోట వ్యాకులమీరా
ఒకచోట ఉజ్వల సీత
ఒకచోట విషాద 'కర్బలా'
ఒకచోట వినోద రామలీల
అయోధ్యా! మనది అనేకానేక జన్మల కథ!
నాలో-ఈనాటికీ-శతశతాబ్దాలనాటి
కరుణామూర్తి గౌతముడు జీవించివున్నాడు
వేయివేణువులూదుతూ వేలయేండ్లనాడు
విశ్రుత విహారంచేసిన జవనపవనాలు

ఈనాడు నిశ్శబ్దంగా మెల్లమెల్లగా
అడుగుల్లో అడుగులేసుకుంటూ వీస్తున్నాయి.
నాలో అంతర్నిహితమైవున్న జ్ఞాపకాల రూపకాలను
నాకు సాక్షాత్కరింపచేస్తున్నాయి;
అయోధ్యా!
నా హృదయం వెలుపల కర్బలా
నా హృదయంలోపల కపిలవస్తు!
నాలో మక్కా! నాలో మదీనా!
నీ ప్రాచీన ప్రకాశమాన హృదయ సౌధంలో
నేడు మళ్ళీ నివాసం ఏర్పరచుకోవలసివుంది.
ఈ నా శరీరాన్ని ఆచ్ఛాదించే
కాశ్మీరవర్ణ రంజితమైన గౌసెన
నీ భిక్షే! తల్లీ!
నా చేతిలోని ఈ భిక్షాపాత్ర ని భిక్షే జనని!
గాఢాంధకార భయంకర రాత్రుల్లో నా నిరంతర ప్రయాణం;
ఇదిగో! వస్తున్నాను.
అయోధ్యా!
తలయెత్తి నావైపు చూడవమ్మా!
అలసి సొలసిన అడుగులతో తడబడుతూ
నీ వైపే వస్తున్నాను.
కాల నిశా పథాల మీద
కాళ్ళకు తగిలిన రాళ్ళ దెబ్బలతో
కదలి వస్తున్నాను నీకోసం;
భయంతో వణికిపోతున్నాను—
దశాబ్దాలుగా నాలో నీకోసం దాచుకున్న
కమనీయ కాంతుల్ని తీసుకొస్తున్నాను.
నన్ను నీ వద్దకు పిలుచుకో, తల్లీ!
వస్తున్నాను నీ ఒడిలోకి! నగరిమతల్లీ!

డా॥ దాశరధి
104 (సి. బ్లాక్)
మాతృశ్రీ ఫ్లాట్, హైదరాబాదు-1

# చైతన్యానికి చైత్రామంత్రణ

— సోమసుందర్

చలి!

నిశ్శబ్దంగా గాండ్రించే పులి;
వసంతంవస్తే, సంతసంతెస్తే
కరిగిపోయే మంచుపులి...
బలహీనుల్ని పట్టి ఎముకలు కొరికేకలి!
నమిలిమింగే, సల్లార్చే ఆకలి!

అడవిలోని వృక్షాలన్నిటినీ
వసంత తేజం అదిమినట్లు—
ముఖరేఖలు కోల్పోయిన జనశ్రేణి
ఛాయారూపుల్ని ఆశాకిరణాలాఘ్రాణిస్తే—
లక్షోపలక్షులపై కత్తుల్యదాటి జృంభిస్తే—
చలినీడల పులిగర్జల హాతమార్తిస్తే—
జనహృదయంలో ఆమని, కాముని పున్నమి!

ఆగమించేరుచిర భాగ్యోదయం
తురాయి పూవుల రక్తకేతన మెత్తినట్లు—
చలి పులిని బలికోరుతుంది ఆగత వసంతం!
చలినెత్తురుతో అభిషేకిస్తుంది వసంత తేజం!

పసుపురంగు భూతానికి పాదాలొత్తే భీరువులూ,
కాగితం దొంతర్లమెతకంపు మత్తుల్లో
కనులు పారవశ్యంగా మూసి మురిసే కాపురుషులూ,
రేపటి సూర్యుణ్ణిచూసి భయపడిచచ్చే గుడ్లగూబలు!
ఇసుకలో తలదూర్చి హాయిగా నిట్టూర్చే ఉష్ట్రపక్షులు!

చలిని జయించడానికి చిదుకులు పోగేసే పందలూ
అందరు మనుషులూ ఘనులై గర్జిస్తే
పటాపంచలై తీరుతుంది మాయ చలి!
అదీ విపన్ని వారణ మహాకార్యం!
అప్పుడూ నిజమైన వసంతాగమ కావ్యం!

పంచల్ని పెణకల్ని పట్టుకు వ్రేలాడే చలి
భయపడి పరుగు లంకించుకుంటుంది.
కర్తవ్యాల్ని భగవత్‌శక్తికి అంకిత మొనర్చి
తలలు బోడులు చేసుకున్నా-
తలపులనిండా పూబోడుల్ని నింపుకొని
సునాయాసంగా అనాశక్తికి యోగంలో
తరించ చూచే ఆత్మవంచకుల ఆటకట్టు!

దయ్యాల భూతాల మంత్రాల తంత్రాల కథలతో
కుటుంభరేంద్ర తస్కరుల వంచనా శిల్పానికి
ఆఖరి తెర పడుతుంది; కథ అడ్డం తిరుగుతుంది!
మనుషులందరూ మనీషులమని తెలుసుకుంటే—
కర్మవాదానికీ కౌటిల్యానికీ కాలం చెల్లుతుంది...
రేపటి గుండెల్లో వసంతం గుబాళిస్తుంది...
చలి గుండెల్లో వెలుగు బాకు దిగుతుంది...

ఇదే ఇదే చైత్ర మంత్రణం, రండి!
కాలపురుషుని ఆహ్వాన మందుకోండి...
దుర్వాసనలు ముసిరే గుడిసెలకు
మల్లికానవతేజం కూర్చుకొండి...
కొత్త చిగుళ్ళ ఎర్రని తోరణాలు పట్టండి...
రేపే పండుగ! ఆశల దండలు కట్టండి...
తెరవండి తెరవండి-వసంతోత్సవ శుభోదయపర్వం!

అబద్ధాల పుట్ట గొడుగులు
గ్రీష్మాతపానికి గొడుగులై

రక్షించలేవు మిమ్మల్ని!
నక్కలు గౌరీకళ్యాణం పాడలేవు!

ఇనుప పెట్టెల చీకటి కడుపులలో
ఎన్నాళ్ళని దాగుంటావు ధనలక్ష్మీ!
నువ్వేరికి కట్టుబానిసవో తెలుసుకో:
ఇప్పుడే బయడపడు మనిషి—
మునుముందుకు అడుగిడు మనిషివై!
పాతాళ గృహాలయాల విడిచిపెట్టు ధనలక్ష్మీ!
ఎండల జలతారుమబ్బు విమానాల్లో
హాయిగా విహరిద్దాంపద! అవలోకిద్దాం లోకాన్ని...

మత్స్యన్యాయం బలిసిన నాగరకత—
ఘోరంగా విలపించే సాగరగత...
తక్షణం మార్చడమో-పరిమార్చడమో తప్పదు:
కాలహరణకు ససేమిరా మనతరం ఒప్పదు!
మంత్రించిన మధువన పుష్పాలను
ప్రతి హస్తానికీ అందిస్తోంది కాలం;
ఇదే మనందరికీ-నిశీథసింధువులోంచి
వెలికురికే మధూదయ శీధువు!
మనందరికీ నవోదయమందించే ఆమంత్రణం!

రాబందుల్ని శాశ్వతంగా మట్టుపెట్టే
గాలి పెట్టుల్ని ఉసిగొల్పుదాం-పద...
చలిగాడ్ని వాడి కోటలోనే బంధించి
దక్షిణానిలాల్ని కాపలా పెడదాం-పద...
నిరంకుశత్వానికి తాళాలు బిగించి
వాడి బలగంతో వాడ్నే హతమారుద్దాం-పద...

ఆగామి వసంతానికి ఆహ్వానగీతం
ఆలపిద్దామా ముక్తకంఠంతో!

పొలిమేర్లలో పొంచిన దోపిడీలమీద
శివార్లలో విడిసిన విద్రోహంమీద
నిశితనేత్ర విస్ఫులింగాల
గురిపెడదామా-సమైక్యలాఘవంతో!
పూచిన సురపొన్నల క్రింద-
తేనెల కేళాకూళి నిర్మించుకుందామా!

కళాకేళినికేతన్
పిఠాపురం.



## దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర, హైదరాబాదు

### పరీక్షా విభాగం సూచనలు

1. ఆగస్టు 1982 పరీక్షలకు సంబంధించిన సర్టిఫికెట్లు మే నెల 10వ తేదీలోపున కేంద్రాలకు పంపించి వేస్తున్నాం.

2. ఫిబ్రవరి 1983 ప్రారంభిక పరీక్షల ఫలితాలు ప్రకటించాం.

3. పరీక్షా కేంద్రాలకు, పరీక్షకులకు సొమ్ము పంపివేస్తున్నాం.

అధికారి

# డా॥ బెజవాడ కవిత్వ పరిమళం

—సోమసుందర్

స్వాతంత్ర్యం ధర్మమా అని కాంగ్రెస్ ప్రభుత్వా లేర్పడ్డాయి కాంగ్రెస్ ప్రభుత్వాల దయవల్ల కొన్ని వర్గాలు మున్నెన్నడూ లేనంతగా తళ తళలాడి పోయాయి. ఈ నూతన వ్యవస్థలో గత ముప్ప య్యేళ్ళలోనూ రెండు తిరుగుళ్ళేర్పడ్డాయి. ఒకటి కులతత్త్వం ; గాంధీజీ హయాంలో కడగంటిన కుల తత్త్వం ప్రభుత్వాల పోషణలో బహురూపిగా విజృం భించనారంభించింది. రెండోది అధికార ప్రాపకం ! ఇది సహస్రముఖిగా తానే ప్రభుత్వమన్నంత ధీమాగా పెంపొందింది!

మొదటిదాని గురించి వేరే చెప్పుకోనక్కరలేదు.

రెండోదాన్ని పరిశీలిస్తూంటే ఎంతో ముచ్చట కలుగుతూ ఉంటుంది. అధికారమంటూ ఎలాగోలాగా చేజిక్కించుకున్నవారికి అందరాని మ్రానిపండే కని పించదు. ఇంక కవిత్వానికేముంది ? ఆ విధంగా ఏర్పడిన ఒక వర్గం ఈ దేశంలో అధికార సాహితీ పరులుగా నిగ నిగలాడిపోతున్నారు! వీరికి వెనుక పీఠిలో సాహిత్యాధికార వర్గం నిలిచింది. రక్షక కవ చంలా కాపాడుతు వుంటుంది. ఔచిత్యం, రసపోషణ అభ్యాసం, అధ్యయనం అంటూ పాతమాటలను చిలుక పలుకుల్లా వల్లె వేసే ఈ వర్గం-అధికారులు సాహితీ పరులు కళ్ళెత్తే సరికి మూతులు బిడాయించు కుంటారు !

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అందుకున్న అదృ ష్టాల మాటకువస్తే అవి అలాంటి ఇలాంటివీ కాదు. అందినవన్నీ సక్రమంగా వినియోగించుకున్న పెద్దలు వారు హాయిగా అనుభవించిన రసికావతంసులున్నూ వారే ! అందుకే ఆయన ముందుగా అధికార సాహితీ పరులై, తదుపరి సాహిత్యాధికారులుగా మెరిసి పోతున్నారు. రాజు తలిస్తే దెబ్బలకేం కొదువ? ఇక కవిత్వానికీ కాకర కాయలకీ లెక్కేముంది?

1970 ల దశకంలో మన సాహిత్య చరిత్రకు సంభవించిన చిరస్మరణీయ సంఘటనలలో గోపాల రెడ్డి స్వయంగా రచయితగా కవిగా దర్శనమీయడ ఒక అపూర్వ విషయం ! పూర్వమెప్పుడో వారు రవీంద్రుని విసర్జనాదుల్ని తెలుగుభాష కెత్తకపోలేదు. అప్పుడే అవి సముచిత గౌరవం అందుకోకనూ పోలేదు!

కాని కవిత్వాదికళలు ఆరంభ యౌవనంలోనే సాధారణంగా పసిగుండెల్ని పట్టుకుంటాయి. ఊపిరి సలపనీకుండా కదిలించి వేగిర పెడతాయి. అది కవులందరికీ సామాన్యమే. ఆ సామాన్య సత్యాన్నే ఏషెల్లీయో, ఏమెక్లీషో, ఏటాగోరో అంటే వాళ్ళ కర్మ! గోపాలరెడ్డి వంటి దైవాంశసంభూతులు బ్రతుకు చివరి అంకంలో, డెబ్బయ్యోపడిలో కవిగా గ్రంథకర్తగా ప్రాచుర్యం పొందడం అసాధారణం ! పైన పోర్కొన్నవాళ్ళ విషయమై 'ప్రమాదో ధీమ తామపి'గా ధ్రువపరుస్తుంది.

అరవై ఏళ్ళు పైబడ్డాక చదువుకోక మన్నుకొట్టు కోనా అనే తెలుగు సామెతను అన్నది మరీ తెలివి తక్కువ దద్దమ్మలు కాదు. అందుకే ఆ దశలో తెలుగు కవిత్వాన్ని ఉద్ధరించ పూనుకున్నారు బె గో రెడ్డి పైగా వారు ఇలా పుస్తకం వదిలి చూస్తే చాలు అలా అభినందన సుమపరంపరలే అలవోకగా అంపు

తున్నాయి! కుసుమకోమల దరహాసాలే ఎదురవు తున్నాయి! అదృష్టవంతులకు యిలాంటి వన్నీ అబ్బు రం కాదు.

దేశంలో నాలుగు మూలల్నీ గడాబరించి, వ్రటంగా వేం చేసిన అదృష్టశాలిని స్తుతించని పేదరాశి పెద్దమ్మ లెందుకుంటారీ దేశంలో! అందునా సాహితీపరుల్లో ఉంగరాలున్న అంగుళుల్ని తరతరాలుగా కైవారం చేస్తూనే బ్రతికిందాయె తెలుగు సాహిత్యం !

ఇంతమంది ముక్తకంఠంతో ప్రస్తుతిస్తున్నప్పుడు, తన వ్రాతలన్నీ మేలిమి బంగారమేకాక, పరిమళ భరిత సువర్ణమేనని భావించడంలో అయన తప్పే ముంది పాపం ? అందుకే వారు శరపరంపరగా గ్రంథజాలంతో దేశాన్ని ముంచెత్తివేశారు! ఆశ్చర్యం లేదు! ఇన్ని విధాలుగా యిందరూ స్తుతిస్తూంటే అందులో విశేషమేమిటా అని శ్రద్ధాళులై ఈ సమీక్ష కుడు ఆయన గ్రంథజాలాన్ని పరిశీలించక తప్పలేదు, ప్రస్తుత సమీక్షకు ఎదురై నిలచిన గ్రంథం ఆ కోవలోనిదే!

గ్రంథనామం : పరిమళ తరంగాలు, కర్త. డా. బెజవాడ. 1/8 డెమ్మీ, 108 పుటలు. ఆరు రూపా యలు మాత్రమే! అందమైన రంగు రంగుల ముఖ చిత్రం (బలే చౌకబేరమే!)

కృతికర్త స్వయంగా తెలిపిన నివేదన ద్వారా తెలియబడిన సంగతులేవనగా— "1977 మే నెలలో ఆరంభమైన సాహిత్య కృషి 1981 మే తో ఇంచు మించు మంగళాచరణం" చేసిందని! అంటే ఏమి టని? ఈ ఆరేళ్ళలోనూ సాధించినది అనన్య సామాన్యమైన అపూర్వ కవితా సృజనోత్సవ విజయ మనా ? కానేకాదు. పోయిన షేవింగ్ బ్రష్‌కు జరుపు కున్న రజతోత్సవమట! ఆ రజతోత్సవం ఎంత వైభ వంగా జరిగిందో, కవి తరఫున ఆహ్వానిస్తున్నాను తిలకిసారా?

"యాభై నాలుగులో ఢిల్లీలో అల్లూరి సత్యనారాయణ రాజు అతిథిగా దిగాను. ప్రదేశ్ కాంగ్రెస్ అధ్య క్షునిగా.... నేను క్షౌరం చేసుకొన్న బ్రష్‌ను చూచాడు వెంట్రుకలూడి బక్కచిక్కిన కుక్కపిల్లవలె ఉండింది! నా బ్రష్! కిటికీగుండా దాన్ని పారేశి— పుష్టియైన బ్రష్‌ను తెప్పించాడు బజారునుండి. నాలుగైదు రూపాయలైంది కాబోలు. నాకు బహూకరించి, దాన్నే వాడమని కోరాడు. నాకు సిగ్గువేసింది. ఆర్థిక మంత్రిగా మద్రాసులో పనిచేశాను పొదుపరితనం నేర్చాను. జెయిలులో డాక్టర్ పట్టాభి అట్టి పాఠాలనే నేర్పాడు అని సమర్థించుకో యత్నించాను. పట్టాభి షేవింగ్ సోప్ స్టిక్‌ను ఏడు యేడులు వాడాడని అన్నాను... అల్లూరికి అట్టి పొదుపు భావాలులేవు. ఔదార్యమైన స్వభావము ; ఖర్చుపెడతాడు; అనుభ విస్తాడు!..." ఇంకా ఇంకా ఇలాగే అయిదు పుట లుగా అయిదు అధ్యాయాలుగా సాగుతుందా మహా కావ్యం ! కావ్యమంటే నేను పైన ఉల్లేఖించిన రీతిగా చప్పిడి వచనంగా మాత్రమే ఆయన రాశారనుకొనేరు ఎంతమాత్రం కాదు! పాదపాదాలుగా విడగొట్టి, వీల యిన చోటల్లా స్పేసులిచ్చి, ఒకటిన్నర పుటల గ్రంథం సాగించారు. గ్రంథవిస్తరణ భీతిని నివారించ లేక నేనిలా వచనంలా వ్రాసినందుకు నన్ను నిజంగా క్షమించాల్సిందే ! కాని ఒక్కటి ! ఆ నీరజాక్షులు బోధించిన విద్య నేర్చినవాడనై, పత్రికాస్థలాన్ని దుర్వినియోగ పరచకుండా, పొదుపు చేయడం కోస మని, రనాన్ ప్రోజుగా వ్రాశాను. వారు పెట్టని పంచు యేషను మార్కులేమీ నేను పెట్టలేదు. వారి కవితా హృదయాన్ని నేను ప్రమాణపూర్తిగా ఖరాబు చేయలేదు.

అలాంటి చెడ్డపని చేయడానికి మన మెంతటి వాళ్ళం? మనకేమీ మిగల్చకుండా వారే సర్వ భ్రదం చేశారాయె!!"ముఖక్షేత్రంలో అనుదినం మొలిచే కలుపు మొక్కలు తీసే, ముఖమాలిన్యాన్ని తుడిచే"— షేవింగ్ బ్రష్‌కు రజతోత్సవం చేస్తుకుంటే చేస్తుకో

వచ్చు! పెంపుడు కుక్కలకు వైభవంగా పెళ్ళి చేసి, వందలాది యకరాల భూమిని వాటిపైన సమోదు చేసి తమ దర్పంచాటుకున్న జమీందార్లు విదేశంలో ఎందరు లేరు! అలాగే మన బె.గో. రెడ్డిగారు దేనికి ఏ ఉత్సవం చేసుకున్నా మనకేమీ నష్టంలేదు. కాని ఒక్కటే ఇబ్బంది! ఇదంతా కవిత్వమేననీ, తాను రాసింది మహాకావ్య శ్రేణి అనీ నోరుంది కదా అని బెదిరించబోతేనే వస్తుంది చిక్కు!

అదృష్టవశాత్తు నేడు తెలుగుదేశంలో వచన కవిత్వం రాస్తున్నవారి సంఖ్య వందలకు దాటి వేలలో ప్రవేశించిందా? అందరిలోకీ కనిష్ఠుడనుకునే సదరు అర్భకవి గాడికవిత్వం వెదికినా సరే-ఈ మహనీయులందించిన ఆ కవితా దుర్గంధ పటలం వంటిది ఒక్క శకలమైనా లభించదు! ఇంతకన్న వారికి నేనందించేస్తుతి ఏముంటుంది?

ఇంత విశాల గ్రంథలీలా భూమికలో కవిత్వం కోసం గాలించగా గాలించగా, 'జలమౌక్తి' కాలవలె చేతుల కిమిడినవి బొత్తిగా లేకపోలేదు. అమ్లాన సౌందర్య కమల మాలికల కోసం అన్వేషించే సౌందర్య తృషిత కళా హృదయులకు-చలువ నీడల చెలిమికన్న ఎండవేడిమి మిక్కుటం కావడమే విచారకరం! 'శోకాగ్ని తప్త కాంచనమే మానవుడు' అనగల కవితా వాక్కు కోసం, నిస్తంద్రంగా నిరీక్షించే సహృదయ పాఠకులకు బజారు వచనపు గాడుపు దెబ్బలే తగులుతుంటాయి! నిరీక్షించి నిరీక్షించి, ఉద్ధరిణుడైతేనేం అచ్చమైన కవితా గంగను అందించడానికి ఎందుకు ప్రయత్నించరూ అని గోపాలరెడ్డిగారిని అడిగీ ప్రయోజనం లేదు;

సమాధానం చెప్పడానికా ఆయనకి కాలం సరిపడదు. పోనీ మనతో సమాధానపడడానికా ఆయనకు సమయమూ దొరకదు! పైగా ఆయన వ్రాసిన ప్రతి అక్షరాన్నీ 'ఆహా-ఓహోల' గాండ్రింపులతో మెచ్చుకుంటున్న రసికులీ దేశంలో యిందరుండగా-వారెందుకీ కష్టం భరించాలి?

కవితాదీధి, తీమచ్చు భవనదేహళి చెంతకు వచ్చి నిలచిన 'విశ్వశిల్పి' వంటి రచన లీసంపుటిలో సక్రృత్తుగానైనా లేకపోవడం పాఠకుడి భాగ్యమే! అయితే, ఓంకారం ఒదిలిన వంగభాషా పాదాలను పదబంధాలనూ తెలుగు అక్షరాలలో బిగించడంవల్ల - శ్రీ బెజవాడ వారు తమ పదహారో యేట కుట్టించుకున్న అల్పాకా కోటును దబ్బయ్యారోయేట తొడుకున్నట్లు బహు సుందరంగా కుదిరాయి! ఉదాహరణలుగా కొన్ని-అమ్లాన సౌందర్య కమలమాలికలు, సాగర అంత్య ఆగాధాలను ఆశ్లేషించడం, వంటివి మచ్చుతునకలు!

మాత తెరిసాపై అభినందన వ్యాసం రచించి, పాదవిచ్ఛేదనాక్రతువుతో కవిత్వ గంధర్వ రూపం లభించిందనుకోవడం - భ్రమో, అహంకారమో అర్థంకాదు, ఈ రెండూ కాకపోతే, ఆత్మవంచనేనా కావాలి! బెంగాలీ ఉరుదూ కవిత్వాలు అధ్యయనం చేసిన సంస్కారం శ్రీ రెడ్డి కున్నట్లు ఈ సంపుటిలో చేరిన అనువాదాలు సాక్ష్యం పలుకుతున్నాయి! కాని, "కొంగు చాచి ఎన్ని కోట్ల రూపాయలు తెచ్చిందో ఎన్నిటన్నుల పాల పొడి తెచ్చిందో లెక్కలేదు!" వంటి వాక్యాలు ఎంత గిజాయించుకున్నా కవిత్వం కాలిగోటినైనా తాకలేవన్న సంస్కారం ఆయన కెందు కబ్బలేదో అనూహ్యమే! ఇటువంటివే 'భుట్టో ఉరి!' 'సరోజిని శతజయంతి' వంటి స్వీయ రచనలీ సంపుటిలో మొత్తం ఆధునిక కవిత్వాన్నే వెక్కిరిస్తున్నాయి!

'రవీంద్రుని భాష్పాంజలి', ఇక్బాల్ వాత్సల్య సందేశాలు' వంటి అనువాదాలలోనూ మూల రచయితల కవితా పరిమళం చదువరిని తాకదు. తెల్లమబ్బులు, వానకాలం, శుభాకాంక్షలు-వంటి రచనలలో కవితా భావుకత్వం రేఖా మాత్రంగానైనా దర్శన మీయకపోదుకాని, అదైనా బాల్య చాపల్యపు యాదృచ్ఛికత స్థాయిని మించదు! సర్వరచనా సంగ్రహంలోనూ రచనా పరిపాకం బొత్తిగా కుదరలేదు. ఇది మంచి కవిత్వం అనుకొనే తావులేకపోతే పోయిరి. యిది మంచి వచనం అనుకునేందుకు వీలుకాని వాక్య సందోహమే మిక్కుటంగా కనిపిస్తుంది.

నేను అనే శీర్షికలో కవితా స్వరూపంతో రచించిన స్వీయ చరిత్రను కూడా శ్రీ రెడ్డి అందించక పోలేదు. కేవల స్వరూపాన్ని మాత్రమే చూసి పూజించదలచిన వారికాటోలెదు అవకాశం! ★

జ్ఞానపీఠ బహుమతి గ్రహీత

# అఖిల

రచన : డాక్టర్ టి. మోహన్‌సింగ్

సమాజాన్ని ప్రతిబింబించేదిగా వుండేదే సరియైన సాహిత్యమని విశ్వసించి, సాంఘిక ప్రయోజనాన్ని కాంక్షించి, ఉత్తమమైన రచనలుచేసి, ఆధునిక తమిళ రచయితలలో కథా రచయితగా, నవలా రచయితగా, ఖ్యాతిగాంచిన అఖిలన్ గొప్ప కథాశిల్పి, యుగకర్త; తమిళ నవలలకు జాతీయ ఖ్యాతిని ఆర్జించిపెట్టిన మహామహుడు.

సమాజంలో కనిపించే అన్యాయాలను కలంతో ఎదుర్కోవాలని తపించే అఖిలన్ క్రీ.శ. 1923 లో తమిళనాడు రాష్ట్రంలోని పుదుక్కోట్టై జిల్లాలో గల 'పెరుంగనూరు' అనే కుగ్రామంలో జన్మించాడు. ఈతని పూర్తిపేరు పెరుంగనూరు వైద్యనాథన్ అఖిలాండన్. (అఖిలన్) తన ఏకైక కుమారుడిని ఏ.పియస్. అధికారిని చేయాలని కలలుగన్న తండ్రి శ్రీ వైద్యలింగం పిళ్లై మరణించడంవల్ల బాల్యంలోనే పేదరికం, ఒంటరితనం, నిరాశ, అఖిలన్‌ను చుట్టుముట్టాయి. విద్యార్థి దశలో తిరు వి. కళ్యాణసుందర ముదలియార్, సుబ్రహ్మణ్య భారతి, బంకిమ్‌చంద్ర చటర్జీ, మొదలగు మహోన్నత రచయితల రచనలీతనిలో దేశభక్తిని రేకెత్తించాయి. ఫలితంగా మెట్రిక్యులేషన్ ఉత్తీర్ణుడైన వెంటనే తన చదువు నీతడు విడనాడి గాంధీజీ ప్రభావంవల్ల స్వాతంత్ర్యోద్యమంలో దూకినాడు. అహింసాత్మక వుద్యమంలో తన మిత్రులను చేర్పించి, 'శక్తి యువసభ' అనే సంస్థ ద్వారా దేశసేవ చేయనారంభించాడు.

పేదరికం పీడించడంవల్ల జీవికకై అఖిలన్ తంతి తపాల శాఖలో 'సార్టర్'గా చేరినాడు. ఈ వుద్యోగంలో వుంటూనే, విభిన్న ప్రాంతాలలో పర్యటించి, భిన్న మనస్థితిగల ప్రజలతో సంబంధాలను ఏర్పరచుకున్నాడు. అపుడే 'పేణ్' (కన్యక) అనే నవల వ్రాశాడు. దీనికి "కలైమగళ్" అనే పత్రిక నిర్వహించిన నవలల పోటీలో ప్రథమ బహుమతి లభించింది. ఈ బహుమతివల్ల అఖిలన్ సాహిత్యసాధనకెంతో ప్రేరణ లభించింది. దీనితో ఈయనలోగల అత్మవిశ్వాసం ఇనుమడించింది రైల్వే తపాలా విభాగంలో పనిచేస్తూనే ఈతడెన్నో నవలలను, కథలను, నాటకాలను, వ్యాసాలను, పిల్లల పుస్తకాలను వ్రాసినాడు. ఒక్కొక్క రచన వెలువడినకొలది ఈయన ఖ్యాతి పెరగనారంభించింది.

ప్రచారధోరణి అంటే గిట్టని అఖిలన్‌కు క్రీ.శ. 1954 లో, తన పేరిట యెవరో వ్యక్తి సన్మానం చేయించుకుంటున్నాడనీ, బహుమతు లందుకుంటున్నాడనీ, తెలిసింది. దీనితో తన సంకోచ స్వభావాన్ని విడనాడి పాఠకులముందు వాస్తవికతనుంచాడు అఖిలన్. క్రీ.శ. 1658లో తంతి తపాలశాఖ ఉద్యోగానికి రాజీనామ ఇచ్చి స్వతంత్ర రచనా వ్యాసంగాన్ని చేపట్టిన అఖిలన్ ఆధునిక రచయితల సాహిత్య విలువలతోపాటు సాంఘిక సామాజిక విలువలను, తమ కర్తవ్యాలను గుర్తించుకొని రచనలు చేయాలని ఆకాంక్షించాడు.

తిరుచ్చి నుండి మద్రాసు వచ్చిన అఖిలన్ ఎన్నో ఆర్థిక యిబ్బందుల నెదుర్కొన్నాడు. ఎనిమిదేళ్ళ పోరాటం తర్వాత క్రీ.శ. 1964లో ఆ కా శ వా ణి మద్రాసు కేంద్రపు తమిళ విభాగంలో ప్రొడ్యూసర్‌గా చేరాడు.

క్రీ.శ. 1940 ప్రాంతంలో సాహిత్య జీవితాన్ని ప్రారంభించిన ఈతనికి కథా రచయితగా యెంతో ఖ్యాతి లభించింది. ఈతని కథలు వివిధ భారతీయ భాషలలోనికేగాక, పాశ్చాత్య భాషలైన ఆంగ్లం, రష్యన్, జర్మనీ, ల్లోకి అనువదించబడ్డాయి.

కల్కి, రాజగోపాలన్, చెఖల్, మొపాసా, మొదలైన రచయితల ప్రభావాన్ని గ్రహించి వ్రాయబడిన ఇతని కథలలో ప్రేమ, స్త్రీ పురుష సంబంధాలు, వివిధ సామాజిక సమస్యలు, విధవా వివాహం, కుల మత భేదాలు, వరకట్నం, నాటి భారతీయ కుటుంబాలలో స్త్రీల స్థితి, స్వాతంత్ర్య పోరాటం, భారతచైనా, భారత పాకిస్తాన్ యుద్ధాల చిత్రణ, మొదలైనవి విశేషంగా కనిపిస్తాయి. కుటుంబ జీవితాన్ని కలుషితం చేసే వాళ్ళను, చీకటి వ్యాపారం, సంఘవిద్రోహ కార్యకలాపాలలో మునిగియున్న వ్యక్తులను తన కథలద్వారా నిందించే అఖిలన్ ప్రస్తుత సామాజిక వ్యవస్థ మారినపుడే, నిజమైన అభ్యుదయం వస్తుందని విశ్వసిస్తాడు.

ప్రజల అంతరాత్మలను జాగృతంచేసి, వాళ్ళలో నైతిక ప్రమాణాల పెంపుదలకోసం ర చ యి త లు కృషిచేయాలనీ ఆకాంక్షించే అఖిలన్ గాంధేయవాది. ఈతని కథలు వస్తుదృష్ట్యానే గాక శిల్పం దృష్ట్యా కూడా ఎంతో విశిష్టమైనవి. ఈయన కథల ఆరంభం ముగింపు, యెంతో గొప్పగా వుంటాయి. ఈ కథలలో పాఠకుల కుతూహలాన్ని పెంచే గు ణా లె న్నో వున్నాయి. వివిధ రకాలైన పద్ధతులలో వ్రాయబడిన యీతని కథలలో మనకు కావ్యాత్మకత కనిపిస్తుంది. 1950-60 మధ్యకాలంలో వ్రాయబడిన - ఈయన కథలు అంతకుముందు, ఆతర్వాత వ్రాయబడిన కథలలో కెల్ల శ్రేష్ఠమైనవి.

శక్తివేల, నిలవినిలె, ఆణ్ పేణ్, అమరావతిక్క రైయిల్, శెంకరూబు, శాంతి, వయిపెరందము, మిన్నువదెల్లమ్, కుయందెశిరిత్తడు, సహోదరర్ అన్రో అరువైశెచ్‌చోరూ, ఎరిమలై, సత్తియ ఆవేశమ్, పశియుమ్ బుషియుమ్, విడుదలై, వెలియుమ్, పయిఱుమ్ అనేవి ఈయన ప్రముఖ కథా సంకలనాలు. పిల్లలకోసంకూడా అఖిలన్ చాలా మంచి కథలు వ్రాశాడు. ఈ కథలు "టింగ్‌నగరమ్" "శివప్పు విళక్కు" "కణ్ణాన్ కణ్ణన్" నల్లపైయన్, అనే సంకలనాలలో కూర్చబడినవి,

తెలుగు హిందీ, తదితర భారతీయ భాషలవలెనే తమిళంలోకూడా సాహిత్య ప్రక్రియలలో నవల చాల ముఖ్యమయింది. ఇటీవలి కాలంలోనే వ్యాప్తికివచ్చినా, నేడు తమిళ సాహిత్యంలో దీనికిగల ప్రాచుర్యం మరే యితర సాహిత్య ప్రక్రియకు లేదు. త మి ళ నవలలకు జనాదరణ కొనిపెట్టిన వాళ్ళలో అఖిలన్ ఒకడు.

"మంగియ నిలువు" (1944) అఖిలన్ మొదటి నవల. "పేణ్" ఈయనకు కీర్తి నార్జించిపెట్టిన తొలి నవల. ఈ నవలలో "కృష్ణన్" అనే ఒక ఆదర్శ యువకుడి కథ చెప్పబడింది. తన భార్య వాత్సల్య ప్రేరణ వల్ల ఐ పి యస్. చదవాలని ఇంగ్లాండుకు వెళ్ళిన కృష్ణన్ ఒక స్వతంత్ర దేశంలోని ప్రజలకు, బానిస దేశంలోని ప్రజలకు గల భేదాన్ని తెలిసికొని, దేశంపట్ల తన కర్తవ్యాన్ని గుర్తెరిగి, ఐ.పి.యస్. పూర్తిచేయకుండానే తన దేశానికి తి రి గి వ చ్చి స్వాతంత్ర్యోద్యమంలోకి దూకుతాడు. కృష్ణన్ జీవిత గాథ ద్వారా రచయిత ఆనాటి సామాజిక రాజకీయ ఆర్థిక పరిస్థితులను సజీవంగా చిత్రించాడు.

స్వాతంత్ర్యానికి పూర్వం వ్రాయబడిన అఖిలన్ నవలలు ముఖ్యంగా స్వాతంత్ర సమర గాథను ఇతి

వృత్తంగా కలిగివున్నాయి. వీనిలో ఆనాటి భార తీయుల త్యాగనిరతి ధైర్య సాహసాలు, స్వాతంత్ర్య సముపార్జనకై వారు పడిన శ్రమ, మొదలైన అంశాలు చిత్రించబడ్డాయి. ఈ సందర్భంగా 'పేణ్' "ఇన్బనినేవు" (మధురస్మృతి) "వెంజినలై గళ్)" (హృదయ తరంగాలు), అనే నవలలు ప్రముఖమైనవి,

'నెంజిణ లైగళ్' ఒక దేశభక్తి పూరితమైన నవల. దీనిలో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం 1942 ఆందోళన, బర్మాలో నేతాజీ సుభాశ్చంద్ర బోసు ద్వారా భారత జాతీయసైన్య నిర్మాణము, మొదలైన సంఘటనలు హృద్యంగా చిత్రించబడ్డాయి. ఈ నవలలో నేతాజీ ఉదాత్తత చిత్రణ రచయిత ఎంతో ఆత్మీయతతో చేశాడు

స్వాతంత్ర్యం తర్వాతకాలంలో వ్రాయబడిన అఖిలన్ నవలలు సమకాలీన సమాజంలోని మోసాలను, అవినీతిని, స్వార్థాన్ని, అన్యాయాలను, ఎదిరించే విగా వున్నాయి. స్వాతంత్రోత్తర కాలంలో సమాజంలో తాను ఆశించిన మార్పు రాకపోవడంవల్ల కలిగిన అసంతృప్తిని, బాధను, అఖిలన్ తన నవలలో చూపించాడు. ఈ సందర్భంగా 'వాళపు ఎంగె' పేణ్ మలర్, పాలై విళక్కు, పుదువెళ్లం, ఎంగే పోగిఱరోం, చిత్తిరిప్పావై మొదలైన నవలలు పేర్కొన దగినవి. వాళపు ఎంగె, కులమతాల సమస్యను మన ముందుంచే సామాజిక నవల. కుల మత భేదాలున్నంత వరకు మనము సమైక్యత సాధించలేమని అఖిలన్ ఈ నవలలో అంటాడు. వర్ణాంతర వివాహాలవల్ల, మతాంతర వివాహాల వల్ల ఈ సమస్యకు కొంతవరకు పరిష్కారం లభిస్తుందని అఖిలన్ ఈ నవల ద్వారా వర్ణాంతర వివాహాలను సమర్థించాడు.

'ఎంగే పోగిరోం', (ఎక్కడికి వెళుతున్నాం) అనే నవల ప్రస్తుత పరిస్థితులలోని అవకతవకలను, గాంధేయ మార్గంలోని వైశిష్ట్యాలను, రచయితలోగల సంస్కరణాభిలాషను తెలియజేస్తుంది.

'పుదివెళ్లయ్', నవల దేశభక్తి పూరితమయింది. మూడు భాగాలుగా విభజించబడ్డ ఈ నవల మొదటి భాగంలో పరాధీనమైన భారతదేశ పరిస్థితులను, రెండవ భాగంలో స్వాతంత్ర్య ప్రాప్తికంటే ముందున్న పరిస్థితులను, మూడవ భాగంలో భారతదేశ సామాజిక, రాజకీయ పరిస్థితులను, ప్రభుత్వం కళ్ళుగప్పి సామాన్య ప్రజలను దోచుకుంటున్న వ్యాపారులను, తమవల్ల ధనం ద్వారా సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక రాజకీయరంగాలను కలుషితం చేస్తున్న వారి దుశ్చర్యలను అఖిలన్ పాఠకుల ముందుంచాడు. నవలా నాయకుడైన 'మురుగైయన్' ద్వారా రచయిత పాఠకులలో దేశానురాగాన్ని, శాశ్వత విలువల పట్ల అనురక్తిని కలిగించాలని యత్నించాడు. గాంధీ వాదపు ఆలోచనా విధానపు ప్రభావం ఈ నవలలో స్పష్టంగా కనిపిస్తుంది, 'పూణ్ మలర్' (స్వర్ణ పుష్పం) అనే నవల నేటి రాజకీయ వ్యవస్థలో ప్రముఖ భాగమైన ఎన్నికలలో జరిగే అన్యాయాలను, డబ్బు ద్వారా ఎన్నికలలో జరిగే కుతంత్రాలను వెలికి తెచ్చి, ఈ వ్యవస్థను మార్చాలనే సందేశాన్ని పాఠకుల ముందుంచుతుంది.

ఈనాటి మనిషికి ధనం పట్ల అపారమగు ప్రేమ వుందనీ, చీకటి బజారు, మద్యపానం, జూదం, వ్యభిచారం, దొంగతనం, హత్యలు, మొదలైన సామాజిక అకృత్యాలకు ధనమే మూలమని, ఎంత వరకైతే 'తిరుమూర్తి' లాంటి దుర్మార్గులలో మానసిక పరివర్తన రాదో అంతవరకు సమాజం ఈ చెడుల నుండి దూరం కాలేదనీ, అఖిలన్ ఈ నవలలో బోధిస్తాడు.

'పాలై విళక్కు' (దీపధారిణి) అఖిలన్ శ్రేష్ఠ సామాజిక నవలల్లో ఒకటి. ఎంతో మంది విమర్శకుల ద్వారా మహా కావ్యాత్మక నవలగా అభివర్ణించబడ్డ ఈ నవల తాను నమ్మిన విషయాన్ని నిర్భయంగా తన పాఠకుల ముందుంచి, ఎన్నో కష్ట నష్టాలకు లోనైన 'తణికాచలం' అనే రచయిత జీవి

త్వాన్ని మన ముందుంచుతుంది. ఈ నవలలోని విభిన్న పాత్రల ద్వారా నాటి సాంఘిక రాజకీయ పరిస్థితుల సమగ్రచిత్రణ జరిగింది. మానవుడి మూలప్రవృత్తి యైన ప్రేమ యొక్క మహత్తును ప్రతిపాదించే ఈ నవలలోని స్త్రీ పాత్రలు, నేటి సమాజంలోని స్త్రీల దశను మన ముందుంచుతాయి. 'తణికాచలాని'కి ప్రేరణనిచ్చే దేవకి యవ్వనంలోనే విధవలైన స్త్రీల ప్రతినిధియైతే, అతనికి కళాత్మక అభిరుచిని గలిగించే 'శౌంకరులన్' దేవదాసీలకు ప్రతినిధి. తణికాచలానికి నైతిక బలాన్నిచ్చే గౌరి భర్తేదైవంగా భావించే స్త్రీలకు ప్రతినిధియైతే, అతనిలోని కల్పనా శక్తిని వెలికిదీసి అతనిని పూర్ణత్వం వైపు తీసికొని వెళ్ళే ఉమ, తన అధికారాలపట్ల జాగరూకు రాండ్రైన ఆధునిక స్త్రీలకు ప్రతినిధి.

అఖిలన్ వ్రాసిన సాంఘిక నవలలో విశిష్టమైనది "నిత్తిరప్పావై." (చిత్రప్రియ) 1959-68, మధ్య కాలంలో భారతీయ భాషలన్నింటిలో వెలువడిన సృజ నాత్మక రచనలలో ఉత్తమ మైనదిగా భావించబడి జ్ఞానపీఠ బహుమతికి ఎన్నిక చేయబడిన ఈ నవల సమకాలీన సమాజపు యథార్థ చిత్రణను మన ముం దుంచుతుంది.

'అణ్ణామలై' అనే చిత్రకారుడు ఈ నవల నాయ కుడు. అణ్ణామలై జీవిత చిత్రణతో సహ చిత్రకళ విశ్లేషణను, చిత్రకళవిశ్లేషణ ద్వారా మానవ జీవిత విశ్లేషణను రచయిత గావించాడు. ఈ నవల ద్వారా అఖిలన్ ఒక సౌందర్యలోకాన్ని సృష్టించాడు. ప్రకృ తిలోని అపారమైన సౌందర్యాన్ని 'నాగలింగ పుష్పం' ద్వారా వ్యక్తం చేయ యత్నించాడు అఖిలన్. ఈ నవల నాయక 'ఆనంది' జీవితానికి నాగలింగ పుష్పం ప్రతీక. తద్వారానే ఆనంది మరియు 'మాణిక్యమ్'ల జీవితాలలోని వైషమ్యాలను రచయిత వెలికి తీశాడు.

కళాత్మకంగా, నిరాడంబరంగా, ప్రశాంతంగా, తృప్తిగా బ్రతకడానికి అలవాటు చేసికోవాలనీ, లేక పోతే జీవితం దుఃఖ దాయకం, జుగుప్సాకరంగా మారుతుందని, డబ్బు సంపాదనయే జీవితంకాదనీ; డబ్బుకోసం, కీర్తికోసం, ప్రాకులాడిన వారికి దుఃఖం, భంగపాటు తప్పవనీ, అఖిలన్ అణ్ణామలై, మరియు మాణిక్యమ్ పాత్రల ద్వారా స్పష్టంగా చెప్పాడు.

ప్రకృతితో అవినాభావ సంబంధంగల సమాజంలోనే కళ వికసిస్తుందనే భావన, అధోగతిలో నున్న లలిత కళలను ఉద్ధరించాలనే తపన, యుగయుగాలుగా పురు షుల - అన్యాయాలనుసహిస్తున్న స్త్రీ జాతి సముద్ధ రణకై, స్త్రీ స్వాతంత్రపు ఆవశ్యకత స్పష్టీకరణ ఈ నవలలో కనిపిస్తాయి.

దురాచారి, ధనదాహం, కామదాహం, గల భర్తను విడనాడే స్వాతంత్ర్యం స్త్రీకి పూర్తిగా వుందని; తాళి కట్టినంత మాత్రాన దుర్మార్గుడూ, క్రూరుడూనైన భర్తను భరిస్తూ స్త్రీ జీవితాంతం దుఃఖ పూరితమైన జీవితాన్నే గడపనవసరంలేదని 'ఆనంది' పాత్ర ద్వారా అఖిలన్ భారత స్త్రీ జాతికి సందేశాన్నిస్తాడు.

ఈ నవల నాయికయైన 'ఆనంది' 'అణ్ణామలై'ని ప్రేమించి, పరిస్థితుల ప్రాబల్యం వల్ల మాణిక్యాన్ని పెళ్లాడుతుంది. వివాహం తర్వాత ఆమెకు తన భర్తలో

గల ధనదాహం, కామదాహం, దుష్టత్వం మరియు క్రూరత్వం గురించి తెలుస్తుంది భార్యను కేవలం భోగ వస్తువుగా భావించి ఆమె వ్యక్తిత్వాన్ని గౌరవించలేని తన భర్తను; వంచనతో మోసంతో మానవత్వాన్ని విడనాడి ఇంకా డబ్బు సంపాదించాలనే భర్తను 'ఆనంది' వుపయోగించు కుంటుంది. తాను మాణిక్యం భార్య గానై, గొప్పతప్పు చేశానని తలపోస్తుంది. చివర కతడిని విడిచిపెట్టి అణ్ణామలై దగ్గరకు వెళ్ళి పోతుంది. వస్తువు, శైలి, శిల్పం దృష్ట్యా ఉత్కృష్టమైన ఈ నవలా నాయిక జీవితం, ఆమె ప్రవర్తన పాఠకులను స్త్రీ జీవిత సమస్యలను మఱియు స్త్రీలపట్ల పురుషుల దురాగతాలను గుఱించి ఆలోచింపజేస్తుంది. స్త్రీ సున్నిత హృదయాన్ని, సమాజంలో ఆమె కుండవలె

సిన స్థానాన్ని చిత్రించే ఈ నవల ద్వారా అవసరమైన సందర్భాల్లో విడిపోయే అవకాశం స్త్రీకి లభించాలని అఖిలన్ ఆకాంక్షిస్తాడు. అఖిలన్ ఆలోచనలు మన ప్రాచీన సంస్కృతికి అనుకూలంగా లేకపోయినా, వాస్తవిక, దృష్టికి దగ్గరగా కనిపిస్తాయి. 'ఇంబని నైవుతుణైవి', 'స్నేహిదిసందిప్పు' అనేవి అఖిలన్ ఇతర పేర్కొన్న దగ్గ నవలలో ప్రముఖమైనవి. పాత్ర సృష్టిలో వైవిధ్యం, తాను సృష్టించిన పాత్రల ద్వారా పాఠకుల హృదయాలలో చెరగని ముద్ర వేయడం, సామాజిక జీవితపు వైరుధ్యాల చిత్రణ, మొదలైనవి ఈ నవలల విశిష్ఠ గుణాలు.

'వేంగైయిన్‌మైందన్', 'కయలవియి' వేంట్రిత్తిరు నగర్, అనేవి అఖిలన్ సిద్ధచారిత్రక నవలలు రాజేంద్ర చోళుని రాజ్యకాలాన్ని చిత్రించి 'వేంగైమైందన్' అనే నవలపై ఈతనికి 1963 సాహిత్య అకాడమీ బహుమతి లభించింది. 'కయలవియి' అనే నవల ద్వారా నర్తకియైన 'కయలవియి' సహాయంతో పాండ్యరాజైన సుందర పాండ్యన్ చోళుల ఆధిపత్యం నుండి తమ రాజ్యాన్ని విడిపించుకున్న విధానాన్ని, వేంట్రిత్తిమ నగర్ ద్వారా విజయనగర సామ్రాజ్య ఔన్నత్యాన్ని అఖిలన్ చిత్రించాడు.

4-5 దశాబ్దాల సారస్వత జీవనాలు దాదాపు 20 కథా సంపుటాలను, 15 నవలలను, ఎన్నో పిల్లల పుస్తకాలను వ్రాసిన అఖిలన్ గొప్ప వ్యాసకర్తగా కూడా మనకు కనిపిస్తాడు. అఖిలన్‌వి దాదాపు 7 వ్యాస సంపుటాలు ప్రచురించబడ్డాయి. 'మణమకుళక్కు', అనే వ్యాస సంకలనంలో క్రొత్తగా పెళ్లయిన దంపతులకు ఉపయోగపడే వ్యాసాలు కూర్చబడ్డాయి. 'ఇళ్ళైరుక్కు' అనే వ్యాస సంపుటంలో యువకులకు ప్రేరణ నిచ్చే వ్యాసాలున్నాయి. 'కలైయుమవయిరుమ్' (కళ మరియు జీవితం) అనే వ్యాస సంకలనం యువరచయితలను ప్రేరేపించడం కోసం వ్రాయబడింది. 'కదైక్కలై' అనే వ్యాస సంపుటంలో కథా రచన, కథా సంవిధానం, తమిళకథ, తమిళ నవల ఉద్ధారవికాసాలు మొదలైన విషయాలు చర్చించబడ్డాయి. ప్రేటియిన్ 'రహస్యంగాళ్', అనే సంపుటంలోని వ్యాసాలలో వర్తమాన కాలపు మహాపురుషుల జీవితాల ఉదాహరణల ద్వారా జీవిత సాఫల్యానికి మార్గాలను రచయిత చూపయత్నించాడు.

అఖిలన్ మూడుసార్లు రష్యా వెళ్ళాడు. సోవియట్ ప్రజల సామాజిక ఆర్థిక రాజకీయ కుటుంబ జీవితాలను తెలుపుతూ ఈయన వ్రాసిన వ్యాస సంకలనాలను 'సోవియట్‌నాట్టిల్' 'నాన్‌కండ్ రష్యా', ముఖ్యమైనవి. కథాశిల్పిగా నవలాకారుడుగా, వ్యాసకర్తగానే గాక, అఖిలన్ కవిగా, ప్రముఖ నాటక రచయితగా కూడ తమిళ ప్రజలతో కీర్తి నార్జించాడు. అఖిలన్ ద్వారా వ్రాయబడిన మూడు నాటకాలలో "వాయ్‌చిత్ ఇన్బమ్", అఖిలన్ కవితల సంగ్రహం 'అఖిలన్‌కవితైగళ్', అనే పేరిట కూర్చబడ్డాయి.

ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క విధంగా సంఘంలో అక్రమాలు, అన్యాయాలు, తలెత్తుతాయి. ఇటువంటి సాంఘిక దురన్యాయాలను బహిర్గతంచేసి కలంతో వాటి నెదిరించి తన పరిధిలో పోరాడటం తన కర్తవ్యంగా భావించే అఖిలన్ రచనలకు ఎన్నో బహుమతులు లభించాయి ఈతడందుకోని సాహిత్య బహుమతి లేదంటే అతిశయోక్తి కాదేమో! 'పేవ్' అనే నవలకు 'కలైమగళ్' అనే మాసపత్రిక నడిపిన నవలల పోటీలో ప్రథమ బహుమతి లభించింది. 'నెంజిణలైగళ్' 'కయలవియి', అనే నవలలకు తమిళ సాహిత్య అకాడమీ బహుమతులు లభించాయి. 'ఎంగె పోగిరోం' అనే నవలకు 1975లో అణ్ణామలై చెట్టియార్ స్మారక బహుమతి లభించింది. 'ఎరిమలై' అనే కథా సంకలనానికి, కణాన్‌కణ్ణన్' అనే బాలల కథా సంపుటానికి తమిళ వికాస పరిషత్తు బహుమతులు లభించాయి,

ఒక్క తమిళనాడులోనేగాక, శ్రీలంక, మలేషియా, సింగపూర్, తదితర దేశాలలో నివసిస్తున్న తమిళ ప్రజలలో గొప్ప కీర్తిని సంపాదించిన అఖిలన్ కథలు విభిన్న భారతీయ భాషలలోనికేగాక, ఆంగ్లం, జర్మన్, రష్యన్, తదితర విదేశీ భాషలలోనికి అనువదించబడ్డాయి. అట్లే ఆతడి 'పేన్‌ఫోన్', మలర్, స్నేహిది, పావై దిళక్కు, 'నెంజిన్ అళైగాళ్' 'చిత్తిరప్పావై', మొదలైన నవలలు హిందీ మరియు ఇతర భారతీయ భాషలలోనికి అనువదించ బడ్డాయి.

ఏకళ మరియు ఏ సాహిత్యం కోట్లాది ప్రజల మధ్యకు వెళ్లదో, అది ఉత్కృష్టమైనది కాదని విశ్వసించే అఖిలన్ ఒక ప్రగతిశీలియైన రచయితగా, ఆత్మ సంయమనం మరియు విలక్షణమైన వ్యక్తిత్వం గలవాడుగా ఖ్యాతిగాంచిన నవలా రచయితగా గొప్ప కథా శిల్పిగా, విశిష్ట సాహితీ వేత్తగా సమకాలీన భారతీయ అగ్రశ్రేణి రచయితలలో పేర్కొనదగిన వాడు.



# రఘునాథుని కవితావైభవము

**—తూములూరి పార్థసారథి**
**ఎం. ఏ. (తెలుగు), బి. యస్‌సి., బిఇడి.**

విజయనగర సామ్రాజ్యమునకు సామంతముగా మధుర, తంజావూరు, చెంజి మొదలైన రాజ్యములు నాయకుల పరిపాలనము క్రింద నుండెడివి. వీనిలోనను తలమానికమైనట్టిది, తంజావూరు నాయక రాజుల పరిపాలనా కాలమే. వీరిలోనను రఘునాథుని పాలనము శ్రీ కృష్ణదేవరాయల యొక్క పరిపాలనను జ్ఞప్తికి తెచ్చును.

తంజావూరు నేలిన యీ రఘునాథనాయకుడు మూర్తిమాంబా, అచ్యుతప్ప నాయకుల పుత్రరత్నము. ఈ పుణ్యదంపతులకు రఘునాథ నాయకుడే గాక అచ్యుత నాయకుడను జ్యేష్ఠ కుమారుడున్నట్లు తెలియవచ్చుచున్నది. [1] రఘునాథనాయకుని తాత పిన చెవ్వప్పనాయకుడు ఈ పిన చెవ్వప్పనాయకుడు శ్రీకృష్ణ దేవరాయల సోదరుడగు అచ్యుతదేవరాయల రాణులలోని తిరుమలాంబ సోదరియగు మూర్తిమాంబను వివాహమాడెను. పిన చెవ్వప్పనాయకునికి స్త్రీ ధనముగా అచ్యుతరాయలవారు చోళ రాజ్యం అనే తంజావూరు రాజ్యమును దయచేసినట్లు చెప్పబడుచున్నది.

తంబనగర నాయకులు అచ్యుత దేవరాయలపై తమకు గల ప్రభు భక్తికి నిదర్శనముగా వారి పేర్లలో 'అచ్యుత' శబ్దమును జోడించినారు.

"రసికుడా యచ్యుత రఘునాథ విభుడు"
(రఘునాథ నాయకాభ్యుదయము—ఆ.1)

రఘునాథుని తండ్రి పేరులోనూ, రఘునాథనాయకుని కుమారుల పేర్లకును యిది అన్వయించుచున్నది,

1. తంజావూరాంధ్ర నాయక రాజుల వంశవృక్షము. రఘునాథ నాయకాభ్యుదయము. రఘునాథాభ్యుదయము. పీఠిక (తె) పుట 11 శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు,

అచ్యుత నామాంకితాగ్ర తనూజుఁ
డచ్యుత రామ భద్రావని విభుఁడు.
మొదలైన తనయులు మువ్వురవ్వేళఁ"
(రఘునాథ నాయకాభ్యుదయము-పుట 32 ఆ.2)

పైన చెప్పిన అచ్యుత, అచ్యుత రామభద్రనాయకులు మరియు మూడవ వాడగు విజయరాఘవ నాయకుడును రఘునాథుని పుత్రులు. విజయరాఘవుని నామమునకును ముందు 'అచ్యుత' పదమును రంగాజమ్మ తన మన్నారు దాస విలాస నాటకమందు వాడియున్నది.

రఘునాథ నాయకుడు పరమ భాగవతోత్తముడు. అతడు చేయని కైంకర్యములేదు. ఆతని విశిష్ట గుణ సంపదను గూర్చి :

ఉ॥ సార భుజా బలంబునను జక్కదనంబున సద్గుణంబులన్
ధీరనుత ప్రతాపమున దిక్కులు మిక్కిలి నిండు కీర్తులన్
ధారుణి బ్రోచునేర్పున నుదారదయన్ గవితా చమత్కృతిన్
శ్రీ రఘునాథ భూమి పరిణీ మణికిన్ సములే నృపాలకుల్.

అని రంగాజమ్మ తన మన్నారుదాస విలాస ప్రబంధమందు తెలుపుతుంది.

వెంపరాజు లక్ష్మాంబల కుమార్తె కళావతి, బెంజిరాజు కుమార్తె లక్ష్మమ్మ, వేంకటేంద్రుని పుత్రి యగు వేంకటమ్మ, విశ్వనాథుని పేర విభుపుత్రి అను నల్వురు భార్యలు రఘునాథ నాయకున్నట్లు తెలియును. [2]

రఘునాథనాయకుని కొలువు సంగీత, సాహిత్యములతో ప్రతిధ్వనించుచుండెడిది. ఆయన సభాభవనమగు ఇందిరామందిరమే ఒక కళామందిరము. రాజసభలలో ఆనాడు నట్టువరాండ్రు తమ అందచందములతో వివిధ నృత్యములను బహు జనాకర్షణముగా ప్రదర్శించుట జరిగెడిది. వారెక్కడికి వెళ్ళినను సముచిత గౌరవముతో తగు యేర్పాట్లు గావింపబడేవి. బంగారు పల్లకులనెక్కి మృదంగ హుడుక్కాది కంబులగు వాద్యములు ముందు మ్రోగుచుండ వెడలుచుండెదివారు' రోమపాదుని పనుపున వేశ్యలు ఋశ్యశృంగుని తపోభంగము కల్గించుటకు పోవు సందర్భమున రఘునాథుని రామాయణము నందలి యీ క్రింది పద్యమును దృష్టాంతముగా పేర్కొనవచ్చును.

కం॥ బంగరు పల్లకులెక్కి, మృ
దంగ హుడుక్కాదికంబులగు వాద్యముల్
ముంగల మొరయఁగ నభినవ
శృంగారము మెఱయఁజనిరి చెలువలువేడ్కన్.

మరియు ఆనాటి తంజాపుర నట్టువరాండ్రు రఘునాథుని ఆస్థానమున చూపెడి భరత కళానైపుణ్యము, ఆనాటి వాద్య విశేషములు మనకు యీ రాజకవిచే రచింపబడిన "వాల్మీకి చరిత్రము" నుండి వెల్లడియగును. వాల్మీకి యెదుట రంభ చూపెడి సందర్భమందలిది యీపద్యము.

సీ॥ తరుణీమణి యొకర్తు తంబురా మొరయింప
వెలఁది యొక్కతె ముఖవీణె యూఁద
సరసి జాక్షి యొకర్తు స్వర మండలమువాఁచ
బోటి యొక్కతె దండె మీటి పాడ
విమలాంగి యొక్కర్తు వీణియ పలికించ
గలికి యొక్కతె యుపాంగంబు వూనఁ
గిసలా ధర యొకర్తు కిన్నర మీటంగ
లోల లోచన యోర్తు తాళమొత్త
గీ॥ మఱియుఁగొందఱు సుదతులు మద్దెలయును
నావజము మొదలైన వాద్యములు వట్టి

2. రఘునాథ నాయకాభ్యుదయము, రఘునాథాభ్యుదముల పీఠిక (తెలుగు) పుట. 9.

శ్రుతులు ఘుమ్మని హవణించ నతివ దేశి
నృత్త వైఖరి చూపె మునీంద్రు నెదుట.
(వా. చరిత్రము. తృ.ఆ.ప. 181)

ఇందు ముఖవీణె, తంబురా, స్వరమండలము, దండె, వీణియ, ఉంపాగము, ఆవజము మొదలుగా గల వాద్యములు పేర్కొనబడినవి. ఇవియేగాక రబాబు, మురళి అనునవి యీ ప్రాచుర్యమునను దెను. ఇందలి రబాబు,[3] రుద్రవీణ యొక్క రూపాంతరమని కొందరి అభిప్రాయము.

క్రీ శ 16, 17, 18 వ శతాబ్దులలో అంతకు ముందున్న సంగీత సంప్రదాయములలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చినవి. రఘునాథనాయకుని కాలమందు జరిగిన మార్పులను గురించి తెలియజేస్తూ :

"Like North, Indian Music, the music of the South, too, underwent many changes at the hands of the reformers of the sixteenth, seventeenth and eighteenth centuries. The first great reformer is Ramamatya who lived in the Sixteenth century, followed by Venkatamukhi and others. But the eredit of systematising Carnatic music on the lines followed to-day belongs to Raghuatha Naik (1554-1626) the ruling prince of Tanjore, and his Prime Minister, Govinda Dikshitar. The South Indian veena with its twelve fixed frets had its origin in their time. In his book Sangeetha Sudha, Raghunatha Naik discussed in detail the conflicting views of the early writers and reconstructed the theory and practice on which modern South Indian Music is based. He incorporated many Ragas from North Indian music in the South Indian repertory[4] అని శ్రీ గోస్వామిగారు అభిప్రాయపడినారు.

వా చరిత్ర "మందే రంభ వాల్మీకి మహాముని ఎదుట" "నృత్తగీత వాద్య నిపుణ మార్గ పటిమను" "ప్రదర్శించి అతనిని ఆకట్టు కొందమన్నను" చెవిటి మ్రోలఁ బాడిన సంకునా ఫలము లేకపోయిందని వాపోతుంది పాపం!

గీత వాద్య నృత్తములను నైపుణ్యముగా ప్రదర్శిస్తూ తపమొనర్చుచు రామ నామ స్మరణములో లీనమైన వాల్మీకిని చైతన్యవంతునిగా చేసి ఇహలోకమున పడవేసి తపో భంగము చేయుటకే రంభోర్వసులు ఉద్దేశింపబడినారు. రంభోర్వసు లిద్దరూ యీ విషయములో పోటీ పడినారు. స్పర్థలు బయలుదేరినవి. ఇట్టిలోక

3. It is difficult to determine whether Rabab is a foreign or autochthonous instrument. According to some it is the modified form of the older instrument RUDRA VEENA, which when it travelled westward came to be known as Rabab-"The story of Indian Music" Indian Musical Instruments: పుట. 298 by Sri O. Gosvami.

4. The story of Indian Music, its growth and synthesis, chap XIX, carnatic Music Page 205 by Sri O. Gosvami.

సహజమైన అసూయా భావము ఆనాటి తంజావూరు పట్టువ రాంధ్రలో యుండినట్లు యూహించుకొనుట కష్టసాధ్యము కాబోదు

ఆనాటి ప్రసద్ధ రాగములలోని కొన్నింటిని. అనగా దేశగాంధారి, దేశాక్షి, మలహరి, గుండక్రియ, లలిత, జ్జ మొదలగు వానిని రంగాజమ్మ తన ఉషా పరిణ యమునందు పేర్కొనినది.

సంగీత ప్రాధాన్యము గల వాల్మీకి చరిత్ర మందలి యీ క్రింది పద్యము రఘునాథుని సంగీత శాస్త్ర ప్రావీణ్యమునకు మచ్చుతునక.

సీ॥ ఆదితాళము ద్వితీయక మంతర క్రీడ
జయ మంగళము జగజంపెలీల
చాచపుటంబు చచ్చత్పుటంబును షట్పి
తా పుత్రకంబు విద్యాధరంబు
రతిహంస లీల శ్రీరంగంబు అంగంబు
కంకాళ ఖండ కంకాళములును
కోకిల ప్రియము విలోకితంబు కుడుక్క
డెంకి త్రిభంగి మట్టిగ విజయము

గీ॥ నంది నందన జయసింహ నందనములు
మొదలుగాఁ గల తాళముల్ మొనసినన్ను
గూడి కవచట్టముగఁ గొని యాడితేని
బిరుదు లిదె యిత్తు నీకునేఁగిరుదటంచు.

(వా. చ., తృ. ఆ. ప. 51.)

రంభోర్వసుల నాట్య విద్యా ప్రస్తారమున ఊర్వశి తనకు గల నాట్య విద్యా ప్రావీణ్యమును రంభకు తెలుపుచూ అటువంటి తనతో కలహింప పాడియగునా అని హెచ్చరిస్తుంది.

సీ॥ సంయుతా సంయుత సంజ్ఞక హస్తముల్
పదు మూఁడు నొక యిరువదియు నాల్గు
గ్రంశద్గతుం బొల్పు నృత్త హస్తంబులు
నెదు వక్షంబులు నైదుకటులు

స్కంధంబు లాఱును గంధరల్తొమ్మిది
జానువులెడు పార్శ్వంబులైదు
నుత్తమాంగంబులే కోన వింశతి దశ
బాహుల్ త్రికుక్షలు పదము లాఱు

గీ॥ స్థాయి దృష్టు లెనిమిది సంచారి భావ
దృష్టు లిరువది రసదృష్టు లెనిమిదియును
బొంకముగఁ జూపి వింతకోపులు సెలంగ
నాడఁగలిగిన గల హింపఁబాడినీకు.

(వా. చరిత్రము. తృ. ఆ. ప. 58.)

పై పద్యము రఘునాథ నాయకునికి గల భరత విద్యా ప్రావీణ్యమును తెలుపగలదు.

రఘునాథ నాయకుడు బహు గ్రంథకర్త. పారిజాతా పహరణము, జానకీ కల్యాణము, అచ్యుతాభ్యుదయము, నీల చరిత్రము, వాల్మీకి చరిత్రము. రామాయణ మాదిగా గల గ్రంథములను రచించెను.

"వెలఁదులు కొందఱు వినిపించిరపుడు
భువి మెచ్చ నచ్యుతాభ్యుదయ కావ్యంబు
నవరస చిత్రంబు నల చరిత్రంబు
హరులైన పారిజాతా పహరణంబు
మెఱవడిఁ జూపు వాల్మీకి చరిత్ర
జానకీ కల్యాణ చాటు కావ్యంబు
తా నిర్వహించిన తక్కిన కృతులు
కొందఱు వినిపింప" ౬

అని విజయ రాఘవ నాయకుడు తన రఘునాథ నాయకాభ్యుదయ మందు తెలిపియుండెను. అయితే యిందులో రఘునాథుని కృతమగు గజేంద్రమోక్షము, రుక్మిణీ కృష్ణుని వివాహ మాదిగా గల కృతుల ప్రస్తావన లేదు. కాని "తక్కిన కృతులు" అనుటను బట్టి మిగిలినవి వీనిలో అంతర్భాగమని తలంపవలెను.

మరియు రఘునాథుడు వ్రాసిన కృతులు ఇందిరా మందిరమునందు చదివి వినిపించెడివారు. రఘునాథుడే

౬. రఘునాథ నాయకాభ్యుదయము (ద్విపద) విజయరాఘవ నాయకుడు ప్ర. ఆ పుట. 21.

స్వయముగా బాలరామాయణమును చదువుకొనినట్లు తెలియుచున్నది.

"కొంతసేపు రాణువ కార్యంబులు మణాయించి హసము వారినిం బంచి, స్వారిబోవ నుత్సహించి, యంత నంత: పురముఁ బ్రవేశించిరఁట యెటువలెను· ఇవ్విధంబున నమ్మహీకాంతుండంతః పురముఁ బ్రవేశించి యారగించి, శతపదంబులు త్రొక్కి బాలరామాయణము బఠించి తాంబూల చర్వణముఁ గావించి... నతండు వచ్చె క్రమమెటువలెను"[6] దీనిని బట్టి ఆలోచించిన యెడల రఘునాధ నాయకుడు తొలుత రామాయణమును పూర్తిగా వ్రాయుదమని తలపోసినను బాలకాండమును మించి వ్రాయలేదను ఊహ వ్యక్తము కాగలదు.

"His (Raghunatha Naik's) Ramayanam did not proceed beyond Balakanda, though it is clear that he had planned his poem on the scale as Valmiki Ramayanam. Some Scholars thought Madhuravani translated at his request his Ramayana into Sanskrit, but a close comparison of the two works does not lend any support to that impression "[7]

రఘునాధ భూపాలునికి సంస్కృత కవులలో ఆదికవి యగు వాల్మీకిపై అభిమానము మెండు.అతని చరిత్రమునే ఒక ప్రబంధముగా తీర్చిదిద్దినాడు. మరియు అతని రామాయణమునందలి యీ క్రింది పద్యము వాల్మీకిపట్లగల ప్రత్యేకమైన గౌరవ ప్రపత్తులను సూచిస్తుంది.

కం. ఛందోమయ భారతి భువి
ముందుగ నెవ్వని ముఖాబ్జమున విలసిల్లెం
బొందుగ నయ్యాదికవి
స్వందనములు చేసి తలఁతు వాక్సిద్ధికినై."

ఇక తెనుఁగు భాషయందు కేవలము కవిత్రయము వారిని, కవిసార్వభౌముడగు శ్రీనాధుని స్తుతించాడు. వాల్మీకి చరిత్రమునందు శ్రీనాథుని ప్రత్యేకముగా నొక పంద్యమందు చెప్పుట గమనార్హము. రామాయణము నందు శ్రీనాధుని :

కం. నానాశాస్త్ర పురాణ
జ్ఞానము సందర్భమునఁ బొసంగగఁ గృతున్
న్నెని యొనరించి మించిన
శ్రీనాధుని వచన వైఖరి న్మదిఁ దలఁతున్

అని పొగిడాడు. అయితే స్పష్టముగా చెప్పకపోయినను పద్యపు ఎత్తుగడలోను, యితర విషయములలోను మరికొంతమంది ఆంధ్ర కవులను రఘునాధుడనుకరించాడు. ఉదాహరణమునకు సహజ పాండిత్యుని "బాల రసాల సాల..." అను పద్యపు ఎత్తుగడ వాల్మీకి చరిత్ర మందలి "బాలరసాల సాల ముఖపాద పరాజికిఁబూని" అను పద్యమునకు మూలము. ఇదే రీతిగా సంకుసాల నృసింహకవిని అనుకరించిన సందర్భము కూడా కానవచ్చును.

సహజ వర్ణనలను గావించుటలో రఘునాధుడు తన గ్రంధములందు కడు నేర్పును ప్రదర్శించాడు. రామాయణము నందలి ఋశ్యశృంగుని వర్ణించుపట్ల.

కం. ఆ ఋశ్యశృంగమౌనియు
మూరెడు గడ్డంబు, నెత్తిమొలచిన కొమ్ముల
జాఱల మెకంబు తోలు వి
కారము దెలుపంగ నెదురుగాఁ గనిపించెన్.

అను పద్య మిందులకు తార్కాణము. వాల్మీకి చరిత్ర మందు ఆనాటి బోయల జీవితాన్నిగూర్చి వర్ణిస్తూ ఆ

6. రఘునాథాభ్యుదయము-విజయరాఘవ నాయకుడు. పుట. 28.

7. Histoty of Telugu Literature (English) Southern School of Telugu Litt., chap. IV. Page 89-Sri G. V. Sitapati, Sahitya Akademi, Delhi.

"రోత గన్న నొక్కఁడఁ బ్రేవుల్ గుండెలు నిలువక వాతికి నుండ గిలెడుఁ గర్మఫలమయో యిటులుండె నని" యీ రాజకవి వాపోతాడు.

సీ. తోరంబులుగ వీధుల నారఁగట్టిన
యుప్పు గండలకు నొండొండ దిరుగు
పులుఁగుల ఱెక్కఁగాడ్పులఁ జాలనెగిరెడు
పసరంపుఁ బొలకఁపు ముసురుకొనఁగఁ
బసివట్టి నలుగడఁ బఱచిన మెకముల
పచ్చి తోళ్ళను బండ్లఁ గ్రుచ్చి పెఱుకు
బలు జాగిలంబుల భౌ భౌరవంబులఁ
గొంకి పంకములోన ఘుర్ఘురించి
గీ॥ పరువులిడు నూరబందులు ముఱికిగవులు
చేఁపతట్టుల గదురుతోఁ జెనసి చుట్టఁ
గూఁత వెట్టిన జనుల వాకొలుపఁజేయ
భయము గొల్పెడు లొక బోయపల్లెఁగాంచి.
(వా.చ. ద్వి.ఆ.ప. 91)

సప్తర్షులు ఆ బోయపల్లెను చేరి "చుట్టును బసరపు టెమ్ములు- తెట్టలు చూచినను మదికి దిగులయ్యెఁడు హా- కట్టడి దైవంబచ్చటి- కెట్టు మనలఁదెచ్చె దాఁటు టెట్లో కొయచటన్" అని విచారపడతారు. ఆనాటి అట్టడుగు వర్గాల దయనీయ స్థితిని స్వయంగా యీ భూపాలుడే వర్ణించాడు మరి ! ఎఱుకల వేషధారణ మును వాల్మీకి పాత్రలో బహు సుందరముగా చిత్రించాడు.

సీ॥ కుఱుచగాఁ జుట్టిన కుఱుమాపు దట్టిపైఁ
గొడవలిలో దోటికూడఁ జెరివి
కొడిది పూసలపేరు మెడనంటఁగాఁగట్టి
బిగి యొక్కఁజేవిఁ చీలి బెండ్లుపెట్టి
కొంగ యీఁకలుగొన్ని యంగుగాటఁజుట్టి
నఁకు బల్కుడి యంబు సందిటనిడి
గట్టియల్లిక తట్టబట్టి చంకనమర్చి
సెం విల్లునమ్ములుఁ జేతఁబట్టి
గీ॥ చిక్కముఱిగోలనల బిసజిగురుఁగండెఁ
బాడియునుగొంచుబుడ తరాఁబాలనెమలిఁ
గొఁజుఁగక్కెరఁ గల్లెటిఁగారుకోడిఁ
గొక్కెరను బట్టుచునువచ్చె నొక్కయెఱుకు

మానవ మనస్తత్త్వమును చిత్రించుటలో రఘునాథ నాయకుడు సిద్ధహస్తుడు. సప్తర్షులు పూర్వాశ్రమమున నిషాదునిగానున్న వాల్మీకిని అతడు చేసిన పాపములకు అతని సంతానముగాని, యిల్లాలుగాని భాగస్వామ్యులగుదురేమో అడుగవలసినదిగా పలికినప్పుడు అడుగుటకై బోయపల్లెకు బయలుదేరినాడు. ఈ సందర్భమున అతని మానసిక పరితాపమును యీ రాజకవి యెంతో చక్కగా తీర్చిదిద్దాడు. బయల్దేరినప్పుడే నిషాదుని హృదయము స్పందించినది. మార్పురాజొచ్చినది. "మార్గంబున నేణవర్గములనేఁ చంబోక లక్షించి పక్షిని కాయంబులఁ గొట్టఁగోరక మదిం జింతా భరం బెంతయుం ఘనమై" యుండ బోయపల్లెకు బయలుదేరాడు. తన పాపమును తలపోయుచూ తల్లడిల్లినాడు.

ఇదే రీతిగా ఎఱుక స్త్రీ యొక్క దీనావస్థను వర్ణించు పట్ల కూడ రఘునాధుడు తన నైపుణ్యమును చూపి చదువరులకు ఆయా పాత్రలపై ఉదాత్తతను పెంపొందించినాడు.

రఘునాధుని కాలమునందును, ఆ తర్వాతను తంజావూరి గణికల కున్నంత గౌరవము ప్రతిపత్తి అగ్రవర్ణము వారికిని లభింపలేదనుట సత్యదూరము కాబోదు. రాజసభలనే పావనమొనర్చుచు కనకాభిషేక గౌరవములను ఆయా నాయకరాజులచే పొందిన యీ జాణలు సంగీత సాహిత్యములందలి నైపుణ్యముచే వారి కళా హృదయములను దోచుకున్నారు! వీరిలో కొందరు ధర్మ పత్నులుగానో, పత్నులుగానో చెప్పకొనెడి సాహసము గ్రంధస్థము చేయుటనుబట్టి వీరిపట్ల రఘునాధ నాయకాదుల కున్న అనురాగము సువ్యక్తముకాగలదు. ఆనాడు వారాంగనలను లక్ష్మి, సరస్వత్యాది దైవతములతో పోల్చబడిన సన్నివేశములును కానవస్తాయి ఈ విధముగా ఆనాటి రాజులు భోగలాలసులైనను, పరమభాగవతోత్తములై తమ జన్మను చరితార్థము గావించుకొనినారు

రామనామంబె సారంబు రామభద్ర
రామచంద్ర రఘూద్వహరామయనుచు
ననయము జపింప వలయు దక్కినవి యేల
రామనామంబునకు సరిరావుదలఁప (వా.చ.ఆ.3)

అని రఘునాధుడు తనకు రఘురామునిపై గల భగవద్భక్తిని చాటి చెప్పి ధన్య జీవుడైనాడు. ★

# సాహిత్యగోష్ఠి

## జానకి విముక్తి—ఒకపరిశీలన

శ్రీమతి రంగనాయకమ్మగారి నవల జానకి విముక్తి మూడు భాగాలుగా నాలుగుసంపుటాలుగా రమారమి 1200 పుటలుగల బృహత్తరమైన నవల. దీనిలో జానకి అనే యువతి అత్తగారూ, భర్తా పెట్టే శారీరక, మానసిక హింసలను భరించలేక గృహత్యాగం చేయడం ఇతివృత్తం. సమాజంలో స్త్రీలది అసమానత్వమేకాదు. బానిసకన్న హీనమైనస్థితి. తత్ఫలితంగా ఆమె అనుభవిస్తున్న శారీరక, మానసిక హింసలూ, వానినుంచి బయటపడేందుకు, కనీసం ఆత్మరక్షణ చేసుకునేందుకు జరుగుతున్నదీ, జరగవలసినదీ కృషిదీనికథావస్తువు. సమాజంలోసగభాగంగావున్న స్త్రీలను మనుష్యులనుగాకూడ మన భాషగుర్తించదు. మనకుతల్లిగా తోబుట్టువుగా భార్యగావున్న స్త్రీ మనభాషలో పశువుతో నిర్జీవ పదార్థాలతో తుల్యమైన గౌరవాన్నే పొందుతూంది. ఈపరిస్థితికి తీవ్రమైన అధిక్షేపణ తెలుపుతూ, అంతకన్న తీవ్రమైన ఆవేదన, ఆవేశంతో శ్రీరంగనాయకమ్మగారు జానకి విముక్తి వ్రాసేరు.

స్త్రీయొక్క దుర్దశ మనదేశానికే పరిమితంకాదు. సోషలిష్టుదేశాలలో స్త్రీ స్వాతంత్ర్యం పొందకపూర్వం ఈగోళం మీదమనుష్యుడు ఎక్కడున్నా ఈపరిస్థితే వుండింది. ఎందుచేత ? ఈ ప్రశ్నకు రెండుమూడు వందల యేళ్లపాటు సమాజశాస్త్రవేత్తలు పరిశీలన జరిపి స్త్రీలు అనుభవిస్తున్న ఈ బానిసస్థితి మధ్యలోవచ్చిందేగాని, మనుష్యజాతిలో ఆదినుంచీలేదని నిర్ధారించేరు ఆ పరిశీలనా ఫలితాలను క్రోడికరించి గతశతాబ్ది ఉత్తరభాగంలో ఫ్రెడరిక్ ఏంజెల్సు "కుటుంబం, వ్యక్తిగతాస్తి, రాజ్యాంగాల పుట్టుక" పేరుతో ఒకగ్రంథం వ్రాసేరు. దానిలో ఆయన మోర్గన్ అనే అమెరికన్ సమాజశాస్త్రవేత్త వ్రాసిన Ancient Societyని ప్రాతిపదికగా తీసుకున్నారు.

మానవజాతి వ్యవహార సౌకర్యం కోసం ఏర్పరచుకొన్న మొదటి పని విభజన-స్త్రీపురుషుల మధ్య స్త్రీది గృహనిర్వహణం, మగవానిది ఆహార సేకరణ. ఆనాటి సమాజనిర్మాణంలో తల్లి హక్కు చలామణి అవుతుండేది. స్త్రీ పురుషులు ఎవరు తయారు చేసుకున్న వస్తువులూ, వుపయోగించే పనిముట్లూ వారివి. వారసత్వం తల్లి వేపు నుంచే సంక్రమించేది.

అయితే సమాజం ఏ ప్రదేశంలోనూ కూడ ఇదే దశలో నిలిచిపోలేదు. మనుష్యుడు పశువుల్ని పెంచడం నేర్చుకున్నాడు. మందలు పెరిగేయి సమాజంలోని కట్టుబాట్ల ప్రకారం అవి మగవాని ఆస్తి. ఆఆస్తిమీద అనుభవమూ, వారసత్వాధికారమూ మగవాని వేపునుంచే అమలు జరిగేటట్లు క్రమబద్ధం చేయడానికై సంఘంలో వున్న తల్లిహక్కు స్థానే తండ్రి హక్కును ప్రవేశపెట్టేరు. దీని ఫలితాలను ఎంగెల్సు ఇలా పేర్కొన్నారు.

"తల్లి హక్కును రద్దుచేయడం స్త్రీజాతికి సంభవించిన పరాజయం అని చెప్పాలి. ప్రపంచ చరిత్రనే అది మార్చింది ఇంట్లో కూడా మగవాడే పెత్తనం పట్టుకున్నాడు. స్త్రీపరాభవం పొందింది. మగవాని కామానికి బానిస చేయబడింది పిల్లల్ని కనే యంత్రంగా మార్చబడింది.''

(ఎంగెల్సు : కుటుంబం......పుట్టుక. పుట 92. విశాలాంధ్ర ప్రచురణాలయ ప్రచురణ).

ఇది సమాజంలోనూ కుటుంబంలోనూ స్త్రీని ఎంత హీనస్థితికి తెచ్చిందో భారతం కృష్ణరాయబార ఘట్టంలో కుంతి కృష్ణునితో తన గోడు చెప్పుకుని ఏడ్చిన ఈ రెండు పద్యభాగాల నుంచి ఊహించుకోగలము.

ఈ పదమూడేడులును నాకు
బావకొడుకుచే వదయమగు
ఘాడు గుడుచుట... యయ్యొ

నేమి చేయగల ననఘా॥ (ఉద్యోగ.)
... ఇట్టి క్రూరుల యిఁటి
కిచ్చిన మనవారి నందుగాని॥

పరాధీనపు బతుకు, ఆత్మగ్లాని, నిరీహస్థితికి ఇంతకన్న బలమైన సాక్ష్యం వుండదు.

అయితే సమాజం అక్కడే ఆగిపోలేదు. పెట్టుబడిదారీ వ్యవస్థ ఏర్పడినాక స్త్రీవిముక్తి పొందడానికీ, పూర్ణస్వాతంత్ర్యం, పూర్ణసమానత్వం సాధించడానికీ అవసరమైన పూర్వరంగం సన్నద్ధం కాసాగింది. అన్నిటికీ ప్రథమంలో స్త్రీయొక్క శ్రమకూడా సామాజిక శ్రమలోభాగం అయ్యే పరిస్థితులు ప్రారంభమయాయి. సామాజికశ్రమలో ఒక భాగంగా వుండినస్త్రీల శ్రమ, కుటుంబానికి మాత్రమే పరిమితమయి సామాజికశ్రమ స్వరూపాన్ని కోల్పోవడమే ఆమె బానిసత్వానికి మూలం. ఆ పరిస్థితి సర్దుబాటు అయ్యే ఘట్టం పెట్టుబడిదారీ ఉత్పత్తివిధానంతో ఆరంభమయింది.

అతిప్రాథమికమయిన ఈ మార్పుకు అనుగుణంగా స్త్రీలలో మనోవికాసం, సాంస్కృతిక అభివృద్ధి వస్తున్నాయి. వివిధదేశాలలో తలఎత్తిన స్త్రీవిమోచన (వ్యుమన్స్ లిబ్) వుద్యమాలు, వానిని ప్రోదిచేస్తూ, బలపడుతున్న అపార సాహిత్యమూ మనకు నిదర్శనాలు. ఈ జానకి విముక్తినవలే దానికి ప్రత్యక్షసాక్ష్యం. ఇప్పుడు సాగుతున్న స్త్రీవిమోచనోద్యమాలు ప్రధానంగా బూర్జువా, పెట్టుబడిదారీ వ్యవస్థకే పరిమితమయినాయనీ, అవి అసమగ్రమనీ, స్త్రీపూర్తి స్వాతంత్ర్యం పొందగలది కమ్యూనిస్టు సమాజంలో మాత్రమేనన్న స్పృహతోవ్రాసిన నవల ఇది. దీని విశిష్టత ఇదే.

నవలగా చూస్తే మొదటి రెండు భాగాలలో జానకి విముక్తి పొందింది.

'జానకి అతని దగ్గర ఒక్క క్షణం కూడా నిలబడలేక అర్థరాత్రి పూట ఇంట్లోంచి బైటికి పరుగెత్తి చీకట్లో కలిసిపోయింది.

ఆడది భర్తను వదిలివెళ్ళదనే అభిప్రాయంతో వున్న వెంకట్రావు జానకి చేసిన పనికి కొయ్యబారి గదిలో పడి వున్నాడు.'

— అంటూ రంగనాయకమ్మ గారే ఆ భాగాలలోని కథను వివరించేరు. ఆ విధంగా జానకి భౌతికంగా పీడకుల నుంచి విముక్తి పొందింది. మానసికంగా కూడ విముక్తి పొందితే తప్ప స్త్రీవిమోచనం పరిపూర్ణం కాదు.

అటువంటి పరిణామాలకి కావలసిన సామాజిక పరిస్థితులు లేవు. అవి ఒక్కరోజున మన కోరిక ప్రకారం సమకూడేవీ కావు. కనక రచయిత్రి మార్క్సిస్టు సిద్ధాంతాల బలం మీద నేడు సంఘంలో విద్యమానమై యున్న కొన్ని ప్రాతిపదికల మీద కొంత దూరం వూహలు సారించేరు కాని ఈ విషయంలో రచయిత్రి తమకున్న పరిజ్ఞానాన్ని పూర్తిగా, ఓపిగ్గా వినియోగించుకోలేక పోయేరని చెప్పాలి.

భవిష్యద్దర్శనానికి సిద్ధాంతం సహకరిస్తుందన్న మార్క్సు అభిప్రాయాన్ని ఆమె గ్రహించేరు. అయితే సిద్ధాంతం భౌతిక ప్రాతిపదిక మీదనే నిర్మించబడు తుందనేది మరవ కూడనిది.

కుటుంబంలో స్త్రీచేసే చాకిరీకి విలువలేదు. ఆ చాకిరీ— వంటలు, పిల్లలపెంపకం-సాగకపోతే అసలు మనుష్యుడికి రోజేకాదు. అస్తిత్వమే ఉండదు. ఈ చాకిరీ సామాజిక శ్రమలోభాగమైనప్పుడే స్త్రీకిపూర్ణవిముక్తి. ఇది సిద్ధాంతం మాత్రమేకాదు. హోటళ్ల హాస్టళ్లరూపంలో నేటిసమాజంలోనే వండడం శ్రమ సామాజిక శ్రమలోభాగంగా కనిపిస్తూంది. అలాగే క్రెచీలు నర్సరీలు పిల్లలపెంపకం శ్రమని సామాజికం చేసేరూపాలు. అయితే ఇవిప్రాథమిక దశలో, అపరిపక్వ రూపాలలోనే కనిపిస్తున్నాయి. అయితే భవిషత్తుకు ఇవిసూచకలు. ప్రస్తుత సమాజవ్యవస్థమారినా ఇవి ఒక్కరోజులో సర్వత్రా, సమగ్రరూపంలో ఏర్పడవు. అలా ఏర్పడడానికి ఎన్నిహంగులోకావాలి. ఈ మార్పును దేశం అంతటా సమగ్రరూపంలో ప్రవేశపెట్టలేదని తప్పు పడుతూ ఒక అమెరికన్ 'వుమన్స్‌లిబ్' నాయకురాలు సోవియట్ యూనియను కూడా స్త్రీ స్వాతంత్ర్య సాధనకు శ్రద్ధ తీసుకోవడం లేదని వ్రాసింది. ఇక్కడ మన సమస్య ఒక్కటే ఈప్రధాన విషయంమీద రంగనాయకమ్మ దృష్టి సారించినట్లు ఎక్కడా కనబడదు. వండడం, వార్చడం. పిల్లల ముద్ది కడగడం వంటి పనులలో మగవాడు కూడా పాల్గొనాలన్నంత వరకే ఆమె ఆలోచించేరు. అవి స్త్రీ స్వాతంత్ర్యాన్ని సమకూర్చవు. పని బరువును తగ్గిస్తాయి. భార్యకు పనులలో సాయం చేయడం ద్వారా పని బరువును తగ్గించాలనేది వ్యక్తుల సంస్కారానికి, ఆర్థికావసరానికి సంబంధించినది ఇంటిపనులలో మునిగిపోయి, స్త్రీ

వుద్యోగం లేకపోతే తన సంపాదన చాలనప్పుడు మగవాడు కూడా పని సాయం చెయ్యాలి. అమెరికా వంటి దేశాలలో గృహపరికరాలు ఎక్కువగా వాడకంలో వున్నా ఇంటి పనులలో స్త్రీ పురుష లిద్దరూ సహకరించుకోవడం మామూలుగానే వుంది. మనిదేశంలో కూడ సంస్కారం వున్న కుటుంబాలలో ఏదో పరిమితిలో ఈ సహకారం కనిపిస్తుంది. అది చాలకపోవడం కాదు. అసలా సహకారమే స్త్రీ స్వాతంత్ర్యంలో భాగం కాదు.

మరొక విషయం ఇక్కడ స్పష్టం చెయ్యాలి. భార్యా-భర్తల సంబంధం కేవలం ఆర్థికమైనదీ, లైంగికమైనదీ మాత్రమే కాదు. ఈ నాడది ప్రధానంగా సంస్కారంతో ముడిపడి వుంది. ఆ విధమైన సంస్కారలోపం భర్తలలోనే కాదు. అసలు సమాజంలో వుంది. తల్లిదండ్రులు, ప్రభుత్వాధికారము (సమాజ ప్రతినిధిగా) తమ కన్నబిడ్డల విషయంలో, ఉద్యోగినుల విషయంలో బాధ్యత స్వీకరించడానికి నిరాకరించడం మనం ప్రతిదినమూ పత్రికలలో చదివే స్త్రీహత్యలకుమూలం. ఇటువంటి ఘటనలు పదిపదిహేనింటిని రంగనాయకమ్మగారు వుదాహరించేరు. ఒక బలవన్మరణాన్ని కథలోనే చొప్పించారుకూడా.

అయితే ఒక విషయం ఇక్కడ గమనించాలి స్త్రీతనకు కలిగిన పరాజయాన్ని ఎన్నడూనిశ్శబ్దంగా స్వీకరించలేదు.

"ఆడదాన్ని మగవాడు లొంగదీసేడు. అయితే విశాల హృదయంతో విజేతలకు కిరీటాలు తగిలించేకార్యం విజేతలు తీసుకున్నారు. దంపతీవివాహం, హెటియారిజంతోపాటు వ్యభిచారంకూడా ఒక సాంఘిక వ్యవస్థ అయింది."— అంటాడు ఏంగిల్సు (కుటుంబం పుట్టుక-పుట 107. విశాలాంధ్ర ప్రచురణ)

ఒక్క లైంగికసంబంధాల విషయంలోనే కాదు. అజ్ఞానం, విద్యావిహీనత, కుసంస్కారం (ఇవన్నీ మగవాని పెత్తనంలో పొదిగించినవే) బలంతో స్త్రీ మగవాని జీవితాన్ని అస్తవ్యస్తం చేయడం. దుఃఖమయం చేయడం మాత్రమేకాదు, సమాజపురోగతికి కూడా ఆటంకం కలిగించడాన్ని ఫాదర్ అనే స్కాండినేవియన్ నాటకం అద్భుతంగా చిత్రిస్తూంది.

ఇప్పుడు సమాజంలో సమానప్రతిపత్తికై స్త్రీసాగిస్తున్న ప్రతిఘటనస్థాయి ఇంకా పెరిగింది. వారు చదువుతున్నారు, ఉద్యోగాలు చేస్తున్నారు, శాస్త్రజ్ఞులయ్యారు. దానికి ప్రతిక్రియారూపంలో వస్తున్నవే ఈస్త్రీహత్యలు. ఈ విషయాన్ని గుర్తించకపోతే సామాజికగతిని అర్థంచేసుకోలేము.

నవలగా జానకి విముక్తి మొదటి రెండుభాగాలలో ముగిసింది. మూడవభాగంలో ప్రధాన పాత్రలు జానకి అన్న సత్యం, అతని ప్రేమికురాలు శాంత.

ఈ నవల మొత్తంలోని స్త్రీపాత్రలను తీర్చిదిద్దడంలో రంగనాయకమ్మగారు చాల మెలకువ, పరిశీలనాదృష్టి కనబరిచేరు. ఈ మూడవభాగంలో ఆమెకుఇష్టమైన పాత్రగా శాంతరూపొందింది. ఆమె చదువుకుని, న్యాయవాదవృత్తిలో వుంది. విచక్షణాజ్ఞానం, మనోనిబ్బరం కలది. మర్యాద పరిమితుల్ని దాటకుండా తను సుఖపడగలనేర్పు, ఒకరిని సుఖపెట్టగల మప్పిదమూ కలది.

విద్యా విహీనురాలూ, పూర్వాచార పరాయణురాలూ, అయిన సుందరమ్మ (జానకి తల్లి) ప్రపంచాన్ని చూస్తూ ఉన్నతస్థాయికి ఎదగడాన్ని రచయిత్రి చాల సహజంగా చిత్రించేరు.

ఏదో అనాలోచితమైన ఆకర్షణలో పడి కిశోర్‌ను వరుణ్ణిగా ఎన్నుకున్న శారద, అతనిలో వ్యక్తమయిన అసంస్కారాన్నీ, కుసంస్కారాన్నీ చూసి, రోసి ఇంచుమించు పెళ్ళిపీటల వరకూ వచ్చిన అనుబంధాన్ని తోసిపుచ్చింది. వారిద్దరి సంస్కారాల మధ్య గల అంతరం చిత్రించి ఆ ఘట్టానికి రచయిత్రి చాలా ఉదాత్తత కల్పించేరు.

అయితే జానకికి మానసికోన్నతి సమకూర్చే సాధనంగా ప్రవేశపెట్టిన ఆమె అన్న సత్యం పాత్ర చాల బలహీన గా తయారయింది. అతడు ఒక కంపెనీలో కెమిస్టు. ఇతనిని కమ్యూనిస్టుగా, మంచి కార్యకర్తగా. స్త్రీ విమోచనోద్యమాభిమానిగా మతమ తిప్పని విప్లవవాదిగా, నిరంతర అధ్యయన శీలిగా, నిగర్వి గా— మొత్తం మీద మంచి మగవానిలో ఉండాలనుకున్న సద్గుణాల మూర్తిమంతంగా మలచదలచారనిపిస్తుంది. కాని, నవలలో మనకి కనిపించేది ఆలోచన తక్కువా, ఆవేశం అతిమాత్రంగా వుండే వ్యక్తి. జానకి విముక్తి–3 లోని 62–64 పుటల మధ్య వర్ణించిన అతని కల, దానిని గురించిన అతని వూహలు ఆ పాత్ర స్వభావానికి అద్దంలా వుంది. చీటికీ,మాటికీ కాల్చిచంపడం, ఉరి తీయడం మీదకే పరుగెత్తే మనస్సు ఆ పాత్రను మంచి కమ్యూనిస్టుగా చూపడంలో రచయిత్రి విఫలురాలే అయ్యారు.

కమ్యూనిష్టులు హత్యాపరులు కారు, కాజాలరు. కమ్యూనిజ మహత్తర మానవత్వ సమర్థకం. సంఘర్షణలతో, స్వాతంత్ర్య పోరాటాలతో తుపాకితీయడం వేరు. కోపం, ద్వేషంవుంటేనూ, తనమాటకు వ్యతిరేకంచెప్తేనూ ఉరిస్తంభాలూ, తుపాకులూగురించి కలలుకనడం వేరూను. కమ్యూనిజంమీద ఆసక్తి, అభిమానం వున్నవారు మరవనిది ఇది.

శాంత తమ్ముడు హరి అతణ్ణి 'బావా' అని పిలవడానికి సత్యం అభ్యంతరం చెప్పడంతో రక్తసంబంధాలకూ బంధుత్వపు పిలుపుల దగ్గర దూరాలకూ మధ్యనున్న సంబంధాన్ని గుర్తించలేక పోవడమే కనిపిస్తుంది.

శాంతగాజులు వేసుకొని అలంకరించుకోడాన్ని వ్యతిరేకించడంలో శాలీనుడు (సుగాత్రీశాలీనుల కథ) గుర్తువస్తాడేతప్ప వైజ్ఞానిక దృక్పథంగల వ్యక్తి కనబడడు. బంగారపు నగలేకాదు. కర్రముక్కలు ఎముకలు, పక్షి ఈకలుకూడ మానవునికి అలంకార సామగ్రులే అయ్యాయి. మానవుని ఈ మనస్తత్వం గురించి 'డెస్సెంట్ ఆఫ్ మేన్' లో డార్విన్ ఒక ప్రకరణాన్ని కేటాయించేడు.

ఒకే పద్ధతిలో డిన్నర్ల ఏర్పాటు ఈవేళ ఒక సామాజికావసరం. కాని ఆపద్ధతిని ఆసహ్యించుకుంటూ, బల్లలకింద దూరి, ఆ విందును అల్లరిపెట్టుదామంటూ మిత్రులతో సత్యం జరిసిన గోష్ఠి యావత్తు వట్టి చిన్నపిల్లకాయల ఆటలా వుంది కాని, హుందాతనం కనబడదు.

అలాగే సౌజన్యకుమార్-వాణీదేవిల పార్టీ పెళ్లి తతంగాన్ని, ప్రమాణపత్రాల భాషనూ, పెళ్లిసభలో అసందర్భ ప్రసంగాల బెడదనూ అపహాస్యం చేస్తూ రచయిత్రి మంచి దెబ్బ తీసేరు. కాని, ఆ సందర్భంలో సత్యం అనిన మాట సామాజిక సంబంధాలను నిర్లక్ష్యంగా చూసేవాడు తప్ప అనలేనిది.

'ఒక్కగంట కూడా అలాంటి వాగ్దానాలు చెయ్యకూడదు. రేపు విడిచిపెట్టవలసివస్తే ...'

స్త్రీ పురుష దాంపత్య సంబంధాన్ని అంత తేలికగా చూడగల స్థితి సమాజంలో ఈనాడు న్నదని కమ్యూనిస్టులు భావించరు. నిరంతరం ఘర్షణ పడుతూ, జీవితాన్ని దుఃఖమయం చేసుకోడం కన్న విడిపోవడం మేలనడం వేరు. సాధ్యమైనంత వరకు పొరపొచ్చాలు రాకుండా, సర్దుబాటుతనంతో జీవితాంతం కలిసివుందామనే ఆలోచన ప్రకటించడం వేరూను. ఆ నియమపాలన అడుదాని రక్షణకే అవసరం.

అయితే సత్యం చెప్పిన పద్ధతిలోనే- వివాహప్రక్రియతో నిమిత్తం లేకుండా- అతనితో కలిసి కాపురం చేసేందుకై శాంత చేసుకున్న నిర్ణయాన్ని వ్యతిరేకించవలసిన పనిలేదు. ఏమంటే వివాహప్రక్రియను అవశ్యకం చేస్తున్న పరిస్థితులు ఆమెకు లేవు. ఆమె సత్యాన్ని ప్రేమిస్తూంది, కాని అతని మీద అధారపడి వుండవలసిన పనిలేదు. స్వతంత్ర జీవనం వున్నది. వీటన్నిటి కన్న ముఖ్యమైనది ఆమెలో వున్న సంస్కారముఅది తెచ్చి యిచ్చిన వ్యక్తిత్వమూను. వివాహ ప్రక్రియ మీద ఆధారపడ నక్కరలేదన్న ధైర్యానికిది పూర్వరంగం. ప్రస్తుత సమాజంలో స్త్రీలకు ఈ బలంలేదు. భవిష్యత్తుకిది సూచికకావచ్చు గాని, ఈనాడే ఈ పరిస్థితిని ప్రవేశపెట్టాలని కమ్యూనిస్టు ఎవ్వడూ కోరలేడు.

ఇంకొకటి- నవదంపతులు విజ్ఞాననిధులయిన కమ్యూనిస్టులే ఆయినా, అక్షరజ్ఞానం లేని ఎంకి-నాయుడుబావలే అయినా నిరంతర సాన్నిహిత్యం కోసం వెంపర లాడుతారు పరస్పర స్పర్శ, వీక్షణల లోనే అసంతృప్తి ననుభవిస్తారు. ఆ ఆకర్షణ జీవగతం. ఫ్యూడల్ సమాజంలో నవదంపతులే కాదు- వయసు మళ్లినవారు కూడా ఒకచోట కూర్చోడానికి, మాట్లాడుకోడానికి బోలెడు నిషేధాలు అమలు జరిగాయి. మహనీయుడు మునిమాణిక్యం నరసింహారావుగారు తెలుగువాడికి పెళ్లాంతో సరసంగా వ్యవహరించడమూ, సరాగాలాడటమూ తప్పుకాదు. దానిలో ఆనందం వుందని కాంతంకథలతో నేర్పేరు, అయితే రంగనాయకమ్మగారు దానిని 'అకమ్యూనిజం' అనుకున్నారనిపిస్తుంది. ఈ నవలలో 317-20 పుటలమధ్య జానకి ఆత్మ పరిశీలనకథనం చూస్తే నవదంపతులమధ్య ఆకర్షణ వుండడాన్ని తప్పుపట్టడమే. అది ఫ్యూడల్ నిషేధాలకు అధునికత్వపుముసుగు వేయడం తప్ప వేరుకాదు.

సృష్టికర్త అంటూ వున్నాడా అంటూ నడిచిన చర్చ సందర్భంలో హేతువాదానికి,మార్క్సిజానికిగల అంతరాన్ని తిండిముందా, జ్ఞానంముందా అనే పోటీగా చూపించడం తొందరపాటు మాత్రమే. అలాగే వర్గాలు అంతరించడం- సర్వసమానత్వం ఏర్పడడం గురించిన బోధనగాని. స్త్రీల సమస్యలు-ఆస్తిహక్కుమీద నడిచినవాగ్వాదంగాని-ఇల్లాంటి

వేమరికొన్ని ఉన్నాయి. గంద్రగోళం సృష్టించేటట్లూ, దురవగాహన కలిగించే విధంగానూ వున్నాయి.

డబ్బంటే ఏమిటి? దరిద్రం తీరడానికి నోట్లు ముద్రించు కుంటూపోతే పనికిరాదా అన్నప్రశ్నను రచయిత్రి ఎదుర్కొన్న పద్ధతి బాగుంది. అందులో కొత్తదనం లేకపోవచ్చు. అది వేరు. కమ్యూనిస్టులే కాదు. ప్రజా వుద్యమాలలో పని చేసేవారు తమ యిళ్ళలో ఆడ వాళ్ళకు ముందు తరిఫీదు నిచ్చుకొనే శ్రద్ధ తీసుకోవాలని గొల్లపూడి నారాయణగారి తెలుగుగడ్డ నవలనుంచి తెచ్చిన వుదాహరణ సముచితంగా వుంది.

మొత్తం మీద సంఘంలో స్త్రీల స్థితుగతులూ, సమస్యల యెడ రంగనాయకమ్మ గారు చూపిన ఆర్తి, ఆవేదనా అసాధారణం. ఒక అభిమానురాలి లేఖ నుంచి వుదాహరిస్తు ఈ వ్యాసాన్ని ముగిస్తున్నా.

......'రంగనాయకమ్మ గారు నా అభిమాన రచయిత్రి. ఆమె జానకి విముక్తి మూడవ భాగం కొన్నాను. (అదే రెండు సంపుటాలు) నాకెన్నో సందేహాలు కలిగేయి. జానకికి సత్యం లాంటి అన్నగారు లేకపోతే? లేదా అటువంటి వాతావరణం ఆమెకి దొరకక్కపోతే? (ఆమెలాంటి జానకిలు మన సమాజంలో వేలమంది వున్నారు.) అలా ఆ జానకిని వరించేవాడు తటస్థపడకపోతే ఈ నవల ఎలా ముగిసేదో అని. రంగనాయకమ్మ గారు వూహిస్తున్న సమ సమాజం నాకు కనుచూపు మేరలో ఎక్కడా కనబడ లేదు. కాని ఊహలో ఉన్న ఆనందం ప్రస్తుతంలో ఉండదు కదా. నా ఉద్దేశ్యంలో రంగనాయకమ్మ గారిది కేవలం ఊహానందమే. కాని, ఎంత ఆవేశంతో వ్రాశారో బుక్స్. ఎంత అసహ్యంతో చీదరించుకున్నారో నేటి సమాజాన్ని. అలాంటి చైతన్యం నూటికి పదిమంది ఆడవాళ్ళకు కూడా లేదు. ఉండిపుంటే. అదంతా ఊహకు వదిలేయాల్సిందే ...

మహీధర రామమోహనరావు

# కథానికా ప్రక్రియ - రచయితల బాధ్యత

1983 ఫిబ్రవరి స్రవంతి సాహిత్య మాసపత్రికలో ప్రచురించిన వల్లంపాటి వెంకటసుబ్బయ్య గారి "కథాంగాలు—ఒక పరిశీలన" అన్న వ్యాసం చాలా ప్రయోజనకరమైంది. కేవలం, కథలు. కథానికలూ, రాసే రచయితలకే గాక, ఈనాడు విశ్వవిద్యాలయాలలో కథానికా సాహిత్యానికి సంబంధించి, పరిశోధనలు చేసే యువ పరిశోధకులకు ఈవ్యాసం ఎంతగానో ఉపయోగపడుతుంది.

ఈనాడు పత్రికల్లో వస్తున్న కథలు నెలకు దాదాపు వందకుపైగా వుంటాయి. కొన్నికథలు ఎందుకు రాస్తున్నారో కూడా తెలియనిస్థితిలో రాస్తూనే ఉన్నారు. వాటిని ప్రోత్సహించే అచ్చుగుద్దుడు పత్రికలు కూడా లేకపోలేదు. అది ఆ రచయితల కున్నటువంటి పలుకుబడో లేక వాళ్ళ రచనల్లో సంపాదకులకు కనిపిస్తున్న గొప్పతనమో గాని అర్థంగాని విషయంగానే మిగిలిపోతూవుంది.

అన్ని సాహిత్య ప్రక్రియలకన్నా నేడు కథానికా ప్రక్రియ శరవేగంగా ముందుకు దూసుకుపోతూవుంది. ఈ కథానికలు రాస్తుందేవారు కొంతమేరకు విద్యావంతులే అనుకొంటాను. ఇదంతా ఎందుకు చెప్పాల్సి వచ్చిందంటే ఈనాడు పాఠకునికంటే రచయితకు బరువు, బాధ్యత లెక్కువ. ఒక రచయిత రాసిన ఒక చిన్నకథ కానివ్వండి, ఏదన్నా కానివ్వండి అది పదిమందో, వందమందో, వెయ్యిమందో, ఎంతోకొంతమంది చదువుతారు. దాని Influence ప్రభావం తప్పకుండా పాఠకుని మీద వుంటుంది. కాబట్టి రచయిత పాఠకుని మేధాశక్తిని, ఆలోచనా సరళిని పెంచాలేగాని, పాఠకుల్ని భ్రమల్లో ముంచెత్తకూడదు.

ఇకపోతే కొంతమంది ఒకటి అర కథలు రాసి వాటిని పత్రికల్లో ఎట్లాగట్ల ప్రచురించి రచయితలమని కాలర్లు ఎగరేసుకుంటూ కథకు శిల్పం అవసరమా? అని అడిగే రచయితలు లేకపోలేదు.

కథలో కనిపించే పాత్రలు, ఎత్తుగడ (ప్లాట్) వాతావరణం, దృష్టికోణం, కంఠస్వరం, కథన పద్ధతులు— అనే ఆరు అంశాలను కథారూపాంగాలుగా చెప్పుకుంటున్నాము. ఈ అంశాలన్నిటి సమాహారమే (కలయికే) శిల్పం.

శిల్పం తెలుసుకొనే కథలు రాయాలా? అవి కథలోనే వుంటాయి కాబట్టి వాటిని గురించిన గొడవెందుకు అనే వాళ్ళకు ఎలా సమాధానం చెప్పాలో తెలియదు. కాకుంటే ఒక ఉదాహరణ చెప్పచ్చు.

లక్షణాలు తెలుసుకోకుండా కూడా కథలు రాయచ్చు. కానీ కూర, కూడు వండడం తెలుసుకున్న స్త్రీ వంట వేరు. అవేవీ తెలుసుకోకుండానే అవసరం కొద్ది చిన్నపిల్ల వంట వండడం వేరు.

పైన చెప్పిన లక్షణాలు తెలుసుకొని కథలు రాసే రచయితలకీ అవేవీ తెలుసుకోకుండానే కథలు రాసే రచయితలకీ మధ్య, వంట వండడం తెలుసుకున్న స్త్రీ వంటకి, వంట ఎలా వండాలో తెలియకుండానే వండాలని ప్రయత్నించే చిన్నపిల్ల వంటకి మధ్య వున్న తేడాయే కనిపిస్తుంది.

అందుకే 'ఊకుడు కథలు-కథానికలు' అన్న రేడియో ప్రసంగంలో డా. కేతు విశ్వనాథరెడ్డి గారు 'కథానికా రచయితకుండే జీవిత అవగాహనను, రచయితకు తెలిసిన జీవిత వాస్తవికతను పాఠకుడి కివ్వాలంటే శిల్పమనేది అవసరం' అంటారు.

కొడవటిగంటి కుటుంబరావు కథా రచనలు చెయ్యదలచినవారు విరివిగా కథాసాహిత్యం చదవాలి. మొదట్లో అన్ని కథలూ బాగున్నట్లే అనిపించినా రానురాను వాటిలో మంచి చెడ్డలూ, గుణలోపాలు కనిపిస్తాయి శిల్పం కూడా పరిచయం వల్ల లభ్యమవుతుంది'' అంటారు.

ఇదంతా ఎందుకు చెప్పాల్సి వచ్చిందంటే, నేటి సాహిత్యంలో విమర్శ గురించిన పరిజ్ఞానం, పరిశీలనం ఎక్కువగా కనిపించదు. కాబట్టి వల్లంపాటి వెంకట సుబ్బయ్య లాంటివాళ్ళు ఇటువంటి విమర్శనావ్యాసాలను విరివిగా రాయడం ద్వారా నేటి రచయితలకి ముఖ్యంగా యువరచయితలకి రచనకు సంబంధించిన అంశాలను అవగాహన చేసుకోడానికి అవకాశం కల్పించిన వారవుతారు.

ఇట్టి వ్యాసాలను ప్రచురిస్తున్న స్రవంతి సంపాదకులకు, వ్యాసరచయితలకు నాధన్యవాదాలు

**తుమ్మల రామకృష్ణ**
ఎం. ఫిల్. స్కాలర్,
తెలుగు అధ్యయన శాఖ
శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ
తిరుపతి.

# జీవన సమరము- భాషా ప్రయోగము

కళాప్రపూర్ణ శ్రీ రావూరి భరద్వాజ గారు రెండేండ్ల క్రింద 'జీవన సమరము' అను ఒక అపూర్వమైన అద్భుత గ్రంథమును ప్రచురించినారు. మనము ప్రతిదినమూ ఇల్లు విడిచి వీధిలోనికి పోగానే చూచి మరిచిపోవు వ్యథార్త జీవుల యథార్థ గాథల సంపుటమది. అందలి గాథలు 'ఈనాడు' పత్రికలో పరంపరగా ప్రచురింపబడి పలువురు సహృదయులడెందములను కరుణ రసార్ద్రములనావరించి నట్టివే ఇట్టి గ్రంథ మాంధ్రవాఙ్మయమున నిదివరకు ప్రచురింపబడి యుండలేదు. అది సత్యసహితము, రసభరితము. పలువురు బాధాసర్పదష్టుల జీవితములకు ప్రతిబింబము.

జీవనమనగా బ్రతుకు, బ్రతుకుతెరువు అను రెండర్థములు ఉన్నవి. మొదటిది సాగుటకు రెండవది అవసరము. దీనికే మనవారు 'వృత్తి' అని పేరు పెట్టిరి. వృత్తులుగా గుర్తింపబడని బ్రతుకుతెరువులెన్నో ఉన్నవి వాని సంఖ్య గణనాతీతము. వానిలో కొన్ని ఉదాత్తములు కాకపోవచ్చును. అయిననూ కొందరికి బ్రతుకుతెరువులనుటలో సందేహము లేదు. వానిని కొందరవలంబించుటకు వంశ సంప్రదాయమును, పరిస్థితుల వైపరీత్యమును కారణములు. మానవులు బ్రతుకు సాగించుటకు పరిస్థితులతో పోరాటము సలుపవలయును. ఈ పోరాటమున జీవనోపాయమాయుధము దీనితో జయాపజయములు రెండునూ పొందు వారుందురు. అందుచేతనే జీవనము సమరముగా చెప్పబడినది. అందు వ్యథార్తుల సంఖ్యయే హెచ్చు. ఆ వ్యథలు, బాధలు చదువుచుండగా జీవితము దుఃఖమయమను వేదాంతవాక్యమే సత్యమనిపించును.

డాక్టర్ భరద్వాజ గారు ప్రధానముగా కథకులు. వారు రచించిన నవలలు, కథానికలు అసంఖ్యాకములుగానున్నవి. వారింటి దగ్గర కూర్చుండి అనుభవముల కిచ్చిన అక్షర రూపములవి, అవి చాలా హృద్యములై ఎంతోమంది పఠితలనలరించినవి. అందలి వస్తువులన్నియూ, సత్యములు కాకపోవచ్చును. భావాంబరవీథీ విహారము చేయుచు మనోనేత్రమునకు గోచరించిన దృశ్యములను వారందు వర్ణించి

యుండవచ్చును. జీవన సమరమట్టిది కాదు. అద్యంత సత్యము, చర్మచక్షుర్గోచరము. వృత్తి కాని వృత్తి నవలంబించి జీవనసమరము సాగించు స్త్రీపురుష లెందరి తోడనో. యువతీ యువకులెందరి తోడనో, సంభాషించి, వారు విసుగుకొన్ననూ, వ్యసనపడిననూ లెక్కచేయక, సేకరించిన యథార్థ వృత్తముల చిత్రణమిది. వానిని సేకరించుటలో వారుపడిన శ్రమ అపారము. సేకరించిన విషయములను రసవన్మనోహరముగా చిత్రించుటలో వారు చూపిన నేర్పు ప్రశంసాపాత్రము. అనంత వేదనాదంతురితములైన శుష్కవృత్తాంతములను వారు రసోదంచితము లొనరించిన తీరనన్య సాధ్యము. వివిధ వృత్తుల నవలంబించువారితో ప్రసంగించునప్పుడు వారు కొన్నిచోట్ల వారి మాటలనే వాడియుండిరి. కొన్నిచోట్ల తమ భాషలో చెప్పియుండిరి. ఆయా వృత్తులలో వారు వాడు సాధనములను, చేయుపనులను, వ్యవహరించు పదములను; వారిందు పొందుపరచి యుండిరి. అ పదములు నిఘంటువులలో కనపడవు. కొన్ని వృత్తిపదకోశముల లోనికెక్కి యుండవచ్చును. అనంతములైన వృత్తులలో వాడబడు పదముల సంఖ్య అనంతముగానుండును. డాక్టర్ భరద్వాజగారు జీవనసమరములో వాడినవానిని కొన్నింటిని పేర్కొందును. అవి మనకపరిచితములైననూ అత్యంతరమ్యములు. ఆంధ్ర భాషాయోషకపూర్వ సౌందర్యము చేకూర్చు అభినవాలంకారములు.

జీవనసమరసమునందనేక శీర్షికలున్నవి. ఒక్కొక్క జీవితచరిత్రయని చెప్పవచ్చును. ఇందలి వ్యక్తులు కొందరు బ్రతికిచెడినవారు. కొందరు కృతజీవులు, కొందరు పరిస్థితుల వైపరీత్యముచే పొట్టకూటికై ఏదోవృత్తినవలంబించిన వారు, కొందరు ఆపదలకు అపాయమునకు గురియైనవారు. కొందరు వంశపారంపర్యముగా వచ్చుచున్న వృత్తివిడువలేక కడుపునిండక పోయిననూ దానినేపట్టుకుని వ్రేలాడువారు. ఒక్కొక్క జీవితచరిత్రనొక రమ్యమైన చిన్న కథగా రూపొందించుటలో నున్నది. శ్రీ భరద్వాజ గారి ప్రతిభాపాటవము చదువనారంభించిన తరువాత సహృదయుడెవ్వడునూ గ్రంథమును పూర్తిచేయక విడువనొల్లడు. అప్పుడప్పుడు భారతదేశము నందలి దీనుల దుస్థితి యిట్లుండాయని కరుణరసాప్లుతమైన హృదయముతో కన్నీరు విడువకమానడు.

కొన్నిచోట్ల "ఏమికథ ! ఏమిచెప్పుట ! ఏమిసొగసు !" అని అనందపడనివాడుండడు. లౌకికభావము లెట్టివైననూ కళాకావ్యరూపము నొందినప్పుడు రసపరిణామము పొంది ఆనందప్రదములగు చుండునుకదా ! డాక్టర్ భరద్వాజ గారు పెట్టిన శీర్షికలొక్కొక్కటి యొక్కొక్క కవితా ఖండము. అ శీర్షికలెన్నుటలో వారుచూపిన నైపుణ్యము గణ్యము. ఇందలి కథానాయకులలో కమ్మరులు, కుమ్మరులు గాజులమ్మువారు, ఇటుకపనిచేయువారు, టీకాఫీలూ భక్ష్యము లమ్మువారు తాళములు బాగుచేయువారు, నాడాలు చేయువారు, చెట్లునురుకువారు, జానపద గాయకులు—వారువీరన నేల చిల్లరవృత్తుల నవలంబించు వారెందరెందరో కలరు. కొందరు సోమరిపోతులు, కొందరు త్రాగుబోతులు, కొందరు పెద్దచదువులు చదివినవారు కూడా నున్నారు. జీవనసమర మందలి అన్ని రకములునూ ఇందుగోచరించును. డాక్టర్ భరద్వాజగారిందు వాడినభాష వ్యావహారికమయ్యూ అతి ధారాళము, పరమసుందరము. వారాయా జీవితములను చిత్రించిన తీరుకళాసంభరితము. వారు వాడిన కొన్ని క్రియలు, పదములు, పదబంధములు సూచింతును.

బొదబొదలాడుచూ 7
తోడు తీసుకుపోయాడు
గొడుగు పట్టడం 18
సరోసురోపడి 23
నీళ్ళామంటాకాలం
హస్తార్పితంగా 24
అసులుసులుగా వున్న
ఉట్రఉడియంగా
ఉసిలిపోయాడు
అంకభండాలం పనులు

అవజీవాలు
ముద్దరసుద్ది
వేస్తే వేయిరూపులుగా
అడ్డీసరుకు 130
కట్టకారు అయిన
తడి చేస్తే (లంచమిస్తే)
సమమోయిను, సవాదుమెయిను
ఖాయిదాబేరం
పులిచేరు నానుకోళ్లు
కప్పరచీకటి

తీన్‌తేరా 60
జ
పొల్లూనెల్లూ
కట్టుబానిసలు
బులిబుచ్చికం పనులు
అలవసులవలుగా
పిచ్చబద్దు లాభాలు
విచ్చికలు (రూపాయలు)

నాపాడెనాపచ్చిబద్దలూ
రింగరిజన్లు
కరపొద్దు
మొంటుపని
లతో్కరుపనులు
బిళ్ళంగోడు
పిల్లమ్మ ఆట.
కొపెర్లకు 34
సుజనీలు

ఓటి
వాగ్గే
ంలు
జూవెను (57)
బొడ్రాయి
మలాటా (12)
ఇస్పా
మూగరాళ్ళు
దాళాలు (79)
అష్రఫీలు
అణుసుముక్కలు

సరుకోకకడ్డీ
బెట్లు
చహరాలు
పొదసుత్తె
నాడె (22)
గొర్రు, గుంటక
జడ్డిగం, దంతె
లక్కాకు, పరంపట్టె
గుమ్మెలు (147)
అమ్మ, ఒంకెదబ్బనం

గూడపోవు
మల్లబడు
చివ్వేయు
తయారించు
తెక్కెళ్ళాడు (86)
సరుచు (11)
సానాడించు
మాగుడేయు
కగ్రకడుగు
జిగ్రకాగు
గండరించిపోవు

ఈకువెక్క
గడీ
సలాకు
గ్రావరు
కొమ్మకత్తి

## ఇతర పదములు

దరిందరం, ఉద్దేగం
బదవ
వామ,బఫ్
జవరంగా
లబ్బుమని
నసాళం, పల్లుడు
చేవాటు
పుల్లవెలుగు

తెటుకు 89
పయ్యలుకు
జంగిలిగాడ్లు 96
అప్పెసంగా 77
మునుము 7
కూసాలు 14
గంజోగటకో 15
దినపస్తు
లివర్లు 19

అవల్‌రైటు
కుతి, దాదా
ఉబ్బలి, చిర్రజుట్టు
గుబ్బానీలు
కాట్రీడుకోక
చిటికేశ్వరచెట్టు
మణుగుచట్టం 139
వేడవో
నెగళా, పించర్, సంగడి

అన్నిపదములను, పదబంధములు నేను పేర్కొనక పోవచ్చును. అర్థములు సందర్భమునుబట్టి తెలిసికొన వచ్చును. డా. భరద్వాజగారెన్నో చక్కని పదములను సేకరించి సందర్భోచితముగా వాడియున్నారు.

ఈ జీవిత చిత్రణమ లోని ఉపోద్ఘాతములుద్ధృతములు ప్రతివృత్తి ఆరంభమును వారు చక్కగా నిరూపింతురు. ప్రాచ్యపాశ్చాత్య దేశములలో దానికి సంబంధించిన కథ ఉన్నచో చెప్పుదురు. పూర్వభారతీయ సంస్కృతిని ప్రశంసింతురు. ప్రస్తుతము దేశమున చెలరేగుతున్న పేదరికము, లంచగొండితనము. నిరుద్యోగసమస్య, మద్యపానాది వ్యసనములు, ఉద్యోగుల ప్రవర్తన మున్నగువానిని మధ్య మధ్య సూచింతురు. ఇప్పటి చదువుల వ్యర్థత్వము నుగ్గడింతురు. అనాదిగా కొనసాగి వచ్చుచున్న వృత్తులెట్లు విస్మృతప్రాయములై పోవుచున్నవో చెప్పి విచారింతురు. ప్రతి చరిత్రచివర వారు కావించు వ్యాఖ్యానములు చదువువారి గుండెలు నీరుచేయును. రంగురంగుల గాజులమ్మువాని భార్యచేతులు గాజులకు సన్నని వలిపెములు, నేయువాని భార్య మేను మంచికోకకును, నోచుకొనకపోవుట వ్యథ కలిగించును. శ్రీ భరద్వాజగారి జీవనసమరము వారి కథన కౌశలమునకును లోక పరిశీలనమునకునే కాక సర్వకళా ప్రపూర్ణతకును మంచి నిదర్శనము.

డా॥ దివాకర్ల వెంకటావధాని
18/4. ఆర్. టి.
బర్కత్ పురా, హైదరాబాదు - 27




# వేదిక

(వ్యాస సంకలనం)

ప్రచురణ—అమృతవాణి

సెబాస్టియన్ రోడ్

సికింద్రాబాదు-500 003

ఈనాడు తెలుగులో అన్ని సాహిత్య ప్రక్రియల కన్న మిన్నగా నవల రాజ్యమేలుతున్నది. పత్రికలు నవలకు ప్రముఖ స్థానమిస్తున్నాయి. నవలలను చదివే పాఠకులు అధికాధికంగా ఉన్నారు. అందువల్ల నవలా సాహిత్యాన్ని విశ్లేషించి చూపే ప్రయత్నాలు విరివిగా జరుగుతున్నాయి. అలాంటి ప్రయత్నాలకు ఒక కార్య రూపమే ఈ పుస్తకం.

'అమృతవాణి' అనే సంస్థ నవలా, కథా రచనలపై శిక్షణ తరగతులను నడిపి ఆయా రచనా ప్రక్రియలపై సమర్థులైన వారిచేత ప్రసంగాలు చేయించి, ఆ ప్రసంగాలను ఈ వ్యాస సంకలనంగా ప్రచురించింది. నవలను గూర్చి, కథను గూర్చి ఈ ప్రసంగ వ్యాసాలలో విశదంగా చర్చించడం జరిగింది. ప్రసంగ కర్తలందరూ సమర్థులు కనుక ఆయా విషయాలను విశ్లేషించి, వివేచనా రీతిలో సోదాహరణంగా చూపించారు. నవలా రచనపై ఐదు వ్యాసాలు, కథా రచనపై నాలుగు వ్యాసాలు ఉన్నాయి.

శ్రీ దాశరథి రంగాచార్య, 'తెలుగు నవల-పరిణామ వికాసాలు' అనే అంశంపై ప్రసంగిస్తూ తెలుగు నవల ఎలా ప్రారంభమైందీ, తెలుగులోని మొట్టమొదటి నవలగా గణించబడుతున్న "శ్రీ రంగరాజ చరిత్ర" యొక్క విశిష్టతనూ నవలా పరిణామ వికాసాలనూ చక్కగా, సోదాహరణంగా చర్చించారు. 'నవల-సంఘటన' అనే ప్రసంగంలో డా॥ ఆనందారామంగారు సంఘటనల వలన నవల ఇతి వృత్తం ఏలా సాగుతుంది మొదలైన విషయాలను ఉదాహరణ పూర్వకంగా వివరించారు.

డా॥ అక్కిరాజు రమాపతిరావు గారు తమ ప్రసంగ వ్యాసంలో నవలలో పాత్ర పోషణ ప్రాముఖ్యమును చక్కగా విశదీకరించారు. శ్రీ తిరుమల రామచంద్ర నవలలో భాషను గూర్చి అనేక ఉదాహరణలతో వివరించారు. నవలలో శిల్పంఎట్లా మలచడం జరుగుతుందో శిల్పంవల్ల నవలలోని అంశాలు ఏలా సొంపు పెంపును సంతరించుకుంటాయో శ్రీమతి మాదిరెడ్డి సులోచన విశదీకరించారు.

'కథ-ప్రగతి పరిణామం' 'కథ-పాత్రలు' అనే అంశాలపై డా॥ పోరంకి దక్షిణా మూర్తిగారు, 'కథ-సంఘటనలు'అనే అంశంపై శ్రీ పోతుకూచి సాంబశివ రావుగారు, 'కథా రచన-శిల్పం' అనే విషయాన్ని గూర్చి శ్రీ దాశరథిరంగాచార్య సంతరించిన ప్రసంగ వ్యాసములు ఎంతో విజ్ఞాన దాయకంగా ఉన్నాయి.

ఈ ప్రసంగవ్యాస సంకలనం నేటి తెలుగు నవలా, కథా ప్రక్రియలను గూర్చి తెలుసుకోవడానికి మిక్కిలి తోడ్పడుతుంది. అమృతవాణి కృషి అభినందనీయం.

—వేముగంటి

# గేయం - ఛందస్సు

ప్రచురణ-అమృతవాణి

పి. బి. 1588, సికింద్రబాదు-500003

ఇది పుస్తక రూపంలో వచ్చిన ప్రసంగ వ్యాసం. అమృతవాణి వారు ఏర్పాటు చేసిన శిక్షణ తరగతిలో చదివిన వ్యాసం. వ్యాసకర్త డా॥ జి. చెన్న కేశవరెడ్డి, "ఆధునికాంధ్ర గేయ కవిత్వం" అనే అంశంపై పరిశోధన చేసి డాక్టరేట్ పొందిన విద్వాంసుడు. కనుక ఈ గ్రంథరూప వ్యాసం విషయవైశద్యం కలిగి చాలా విపులముగా సాగింది. ఛందస్సు-కవిత్వం, ఛందో భేదాలు, ఛందస్సు-పరిభాష మొదలైన అనేక విషయాలను తెలుపుతూ గణాలు, మాత్రలు మొదలైన గేయానికి సంబంధించిన వివిధాంశాలను విపులముగా, సోదాహరంగా చర్చించారు రెడ్డిగారు. గేయ రీతులను తెలిపే సందర్భంలో ప్రాచీన రగడలనే కాక ఆధునిక కవుల కవితలను కూడా ఉదాహరణలుగా చూపడం మెచ్చుకోలుగా ఉంది. గేయ రచనా విధానం తెలుసుకోవడానికి ఈ పుస్తకం సహకరించగలదనడంలో సందేహంలేదు.

—వేముగంటి

## చదివి, భద్రపరచుకోవలసిన మూడు పుస్తకాలు

**1. కాంతిమయి**

వ్యాస సంకలనం.

పేజీలు 262, వెల 20 రూపాయలు.

**2. లేఖల్లో సంజీవదేవ్**

పేజీలు 254, వెల 20 రూపాయలు.

**3 రసరేఖలు**

ద్వితీయ ముద్రణ.

పేజీలు 310, వెల 25 రూపాయలు.

రచన : సంజీవదేవ్.

ప్రచురణ : కాంతికుంజ సాంస్కృతిక సంస్థ, తెనాలి - 522201

కలకత్తాలో ఒక ప్రచురణ సంస్థ రచయితల పుస్తకాలను ఎంతో జాగ్రత్తగా అచ్చువేసి, ముచ్చటగా బైండింగ్ చేసి అనేకసార్లు జాతీయ బహుమతులు గెలుచుకొన్నది. ముద్రణలోను, కాగితం ఎంపికలోను, బైండింగ్‌లోను అనేక జాగ్రత్తలు తీసుకొన్న ఈ మూడు పుస్తకాలలో అచ్చుతప్పులు దొర్లకుండా ఉంటే మరెంతో బాగుండేది.

రచయిత అభిరుచికి తగ్గ ప్రచురణ సంస్థలు దొరకడం ఈరోజుల్లో విశేషమనే చెప్పాలి. ఖరీదైన కాగితాన్ని వాడడమేకాక టైటిల్ పట్ల ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. పుస్తక ప్రచురణకు ఈనాడుకూడా వ్యక్తులు ఆర్థిక సహాయం చేయడం చెప్పుకోతగ్గ విషయం. 'స్వవిషయం'లో అన్నట్లుగా బృహత్ పథకానికి ఇది నాంది మాత్రమే కావాలనీ, అనేక గ్రంథాలు ఈ సంస్థ ప్రచురించి తెలుగు సాహిత్యానికీ, తెలుగు పాఠకులకూ మంచి ప్రచురణలు అందించాలనీ కోరుకోవడం అత్యాశ కాదనుకుంటాను.

సంజీవదేవ్ బహుముఖ ప్రజ్ఞాశాలి. ప్రస్తుతం చర్చించబోతున్న ఈ మూడు పుస్తకాలు ఈ విషయాన్ని విశదీకరిస్తాయి స్వయంకృషితో తనదంటూ ఒక స్థానాన్ని ఏర్పాటు చేసుకొన్న రచయితగురించి క్లుప్తంగా పరిచయం చేయడం సాధ్యంకానిపని.

కాంతిమయిలో 36, రసరేఖలులో 45 మొత్తం 81 వ్యాసాలుండగా లేఖల్లో సంజీవదేవ్ అనే పుస్తకంలో సంజీవదేవ్ 22 మందికి వ్రాసిన ఉత్తరాల్ని సంపుటీకరించారు.

కాంతిమయిలో వ్యాసాలన్నీ గతంలో పత్రికల్లో అచ్చయినవే. "రసరేఖలు" రెండవ ముద్రణకు నోచుకొన్నది.

ఆధునిక తెలుగు రచయితల్లో రసతత్వంమీద ఎక్కువగా రచించినవారిలో శ్రీ సంజీవదేవ్ ఒకరు,

లలిత కళలను సామాన్యులకు అందుబాటులోకి తీసుకు రావడానికి వారు బాగా కృషి చేశారు.

రూపం, శబ్దం, ఇంద్రియాలు, మనసు, రసం, కళాకారుడు, కళాకృతి, ప్రకృతి - వీటన్నిటికీగల సంబంధం-ఇదే వీరికి ఇష్టమైన వస్తువు. అయితే సూక్ష్మాతిసూక్ష్మమైన విషయాలను సైతం తేలికగా అర్థం అయేవిధంగా రచించి పాఠకుల్ని సమ్మోహి తుల్ని చేసుకోగలరు సంజీవదేవ్.

ఎన్నుకొన్న వస్తువు గంభీరమైనది కావడం వల్ల ఒక్కోసారి వీరి రచనల్లో అస్పష్టత కానవస్తుంది. కాని ఈ అస్పష్టత, గజిబిజి ఎందువల్ల వస్తుందో రచయితే స్వయంగా చర్చించడం ఒక విశేషం

"నా వాక్య నిర్మాణంలో కొన్నిచోట్ల కొంత గజి బిజి, తికమక కూడ వుంటుంటాయి.

"అటువంటి దోషాలను నేను బుద్ధిపూర్వకంగానే చేస్తుంటాను. కొన్ని సమయాల్లో కొన్ని లోతైన సత్యాలను విశదపరచడానికి.

"భాషను వికృతపరిస్తేకాని కొన్ని ప్రకృత సత్యాలు బయట పడవు. అయితే యీ గజిబిజి, తిక మక పాఠకులను కొంత బాధపెడుతాయి. విషయాన్ని అవగాహన చేసుకోవడంలో, విషయ విశదీకరణకు నెగటివ్ మాటలను ఎక్కువ ఉపయోగిస్తాను. నా శైలి సరళమైందే కాని ఆ సారళ్యం కొందరికి కాఠిన్యంగా తట్టటం జరుగుతుంది!

"నా రచనల్లోని విషయాలు కొంత గహనంగా వుంటుండడంతో కొంత జటిలంగా ఉండక తప్పదు." అని రచయితే స్వయంగా చెప్పిన తర్వాత ఈ విషయం వదిలేద్దాము.

రచయిత అన్నట్లుగా నిజంగానే "ఎంత ఎండు విషయం అయినప్పటికీ అంత ఎండుగా ప్రసరించక పోవచ్చు నా రచనల్లో!

"తెలుపబడ్డే విషయం సమీక్షాత్మకంగా వున్నా, తెలిపే శైలి సృజనాత్మకంగా వుండటంవల్ల విషయం లోని జటిలత సరళం అవుతుంది.

"దీన్ని ఇంగ్లీషు మాటల్లో ఇంకా ఎక్కువగా చెప్పవచ్చు. Representation is critical while presentation is creative అని.

నేను ఇంగ్లీషులోకూడ రచనలు చేయడం జరుగు తుంటుంది కనుక తెలుగులో ఇంగ్లీషు నుడికారం అక్కడక్కడ తొంగి చూస్తుంటే నా ఇంగ్లీషు రచనల్లో తెలుగు నుడికారపు ఛాయలు ఎక్కడైనా గోచరించడం జరుగుతుంది " అంటూ తన రచనల్లోని దోషాలను ముందుగా తానే గుర్తించి విపులంగా వివ రణ ఇచ్చారు. బెంగాలీ, ఉర్దూ, హిందీ, ఫ్రెంచి, ఇంగ్లీషు భాషా జ్ఞానం కల్గిన సంజీవదేవ్ రచనల్లో ఆలోచనా స్రవంతి ప్రభావంవల్ల బెంగాలీ పోకడలు, ఇంగ్లీషు ఆలోచనా విధానాలు, సంస్కృత శబ్ద బాహుళ్యం, వినూత్న వాక్య నిర్మాణాలు ఉండడం సహజమే. ఈ విషయాలను కప్పిపుచ్చుకోకుండా తానే స్వయంగా చెప్పుకోవడం రచయిత నిజాయితీని నిరూపిస్తోంది.

ఇక వస్తువు సంగతి. కవిత, కథ, నాటకం - ఈ ప్రక్రియలను రచయితలు ఎక్కువగా చేరదీయడంవల్ల తెలుగులో 'నిబంధ' రచనలు విరివిగా రావడంలేదు. ఈ ప్రక్రియలనే ఎందుకు చేరదీస్తున్నారని రచయి తల్ని అడిగితే పాఠకులు నవలలు, కథలు తప్ప మరేమీ చదవడంలేదనీ రేడియో, టీవీల పుణ్యమా అని నాటికలు చలామణి అవుతున్నవనీ అంటున్నారు. ఉత్సాహం పొంగుతున్న వయసులో కవిత వ్రాసి చందాలు వసూలుచేసి కవితా సంకలనాలు అచ్చు వేయడం జరుగుతోంది తప్ప వాటిని కొనేవారు, కొన్నా చదివేవారు తగ్గిపోయారు.

పాఠకులు చదువుతున్న నవలలు తప్ప మరేదీ ప్రచురించడానికి ప్రచురణ కర్తలు సాహసించడం లేదు. నవల్లలు తప్ప మరేమీ ధారకట్టడంలేదు. కనుక

అభిరుచి ఉన్న పాఠకులకు కావలసిన ప్రక్రియలకు ప్రోత్సాహంలేదు.

నేడు తెలుగు రచన ఈ విషవలయంలో చిక్కుకు పోయింది. అడపాదడపా పత్రికల వాళ్ళు ప్రచురిస్తున్న వ్యాసాలు తప్పితే నిబంధ రచనల ద్వారా పాఠకుణ్ణి చేరుకోగల స్థితిలో ఈనాడు రచయిత లేడు.

అయినా అతి సూక్ష్మ విషయాలను, రచయిత అన్నట్లు 'ఎందు' విషయాలను చేపట్టి,అందమైన వాక్య నిర్మాణం ద్వారా పాఠకుణ్ణి ఆకర్షించి మొదటి పేరా చదివించి, అలా అలా వ్యాసాన్ని పూర్తి చేయించగల రచయిత సంజీవదేవ్.

'డిమాండ్' ఉన్న సరుకును 'సప్లై' చేసే ఈ రోజుల్లో సమాజానికి అవసరమైన దాన్ని తయారుచేసి పాఠకులకు అందించడం నిజంగానే అనితర సాధ్యం.

ఒక వ్యక్తిని పరిచయంచేస్తూ అనేక గంభీర విషయాల్ని ప్రస్తావించే వ్యాసాలు, ఒక స్థానాన్ని గురించి వ్రాస్తూ జ్ఞాపకాలలోకి పయినించే వ్యాసాలు, ప్రకృతి వర్ణన చేస్తూ అత్యల్ప విషయాల్లోంచి అనల్ప విషయాల్లోకి దూకే వ్యాసాలు, లలిత కళల్లో ఏదో ఒక విషయాన్ని ఎన్నుకొని వ్రాసిన వ్యాసాలు, రసతత్వం గురించి భారతీయ-పాశ్చాత్య తత్వవేత్తల అభిప్రాయాల్ని పరిశీలించే వ్యాసాలు — ఈ విధంగా సంజీవదేవ్ వ్యాసాల్ని విభజించవచ్చు.

పుస్తకాలు చదివి రచయితకు సన్నిహితంకావడం, లేఖలు వ్రాయడం, దూరాన ఉన్న మిత్రులతో ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా తత్వ చర్చకొనసాగించడం, వేర్వేరు ప్రదేశాల్లో ఉన్న మిత్రులను కలుసుకొనేందుకు వెళ్ళినపుడు చిన్న చిన్న బృందాలను సంబోధించి వారిని లలితకళల వైపు ఆకర్షించడం, వారికి తెలియని విషయాలను ప్రశ్నోత్తరాల ద్వారా తెలియ చెప్పడం. నిరంతరం సాహిత్యా ధ్యయనం, రచనలు చేయడం— ఇదీ సంజీవదేవ్ నిత్యకృత్యాలు.

ఆల్డస్ హక్స్లీ, అసిత్ కుమార్ హల్దార్, వాంగ్వీ, మాస్తి, దేవీ ప్రసాద్ రాయ్‌చౌదరి, రోరిక్, హరీంద్ర నాథ్ చట్టోపాధ్యాయ,సచ్చిదానందమూర్తి, పావ్‌లోవ్, అమృతాషేర్‌గిల్, రవీంద్రుడు, జార్జికీట్, నందలాల్ బోస్, జార్జి శాంతాయిన, ఆనంద కుమారస్వామి, రహమాన్ చుగ్‌తాయ్, గగనేంద్రనాథ్ టాగూర్, హిరోషిగే, పికాసో, బ్రన్నర్, అవనీంద్ర, బ్రూస్టర్ దంపతులు, భరతుడు, ఆనంద వర్థనుడు— ఇంకా ఎందరో...వీరందిరినీ సంజీదేవ్ మనకు పరిచయం చేస్తారు.

మనిషి, మనీషి—ఇద్దరూ వీరి ప్రేమకు పాత్రులే. రసానందాన్ని అనుభవించగల్గిన వ్యక్తి కృత్రిమమైన సరిహద్దుల్ని అధిగమిస్తాడు.

మంచి సాహిత్యం రాలేదని బాధపడే వారంతా చదివి, భద్ర పరచుకోవలసిన గ్రంథాలు ఇవి.

—వి.యస్. హరినారాయణ్

## ఆచార్య తిరుమలకవిత "చీకటి మెరుపులు"

ఆచార్య తిరుమలగారి కవితల సంపుటే "చీకటి మెరుపులు". ఈ కవితా సంకలనములో మొత్తము 51 కవితలు ఉన్నాయి.

వీరి కవితల్లో మాధుర్యము ఉంది. రసస్ఫూర్తి ఉంది. ఆర్ద్రత ఉంది. ముగ్ధమోహన రాగముంది. అందుకే "తెలుగు తేనె" శీర్షికలో ఇలా అంటారు.

"ఇది మధురిమకు పునాది
నవరసాల శబ్ద ధనస్సునా తెలుగు
నవయుగాల కాంతిసరస్సు నా తెలుగు
వేదానికి భాష నా తెలుగు"

-అని అన్నప్పటికిని ఇందుకు పూర్తిగా భిన్నంగా "అగ్నికిరీటం" అనే శీర్షికలో జాతీయ జెండాను గురించి ఇలా అంటున్నారు.

"పచ్చని మన భారతి ముండమోసి
సన్యాసుల్లో కలిసిపోయిందని" అంటూనే ఇలా వివరిస్తున్నారు.

"పరిమళం విడిచిన దండకి
పౌరుషం విడిచిన జెండాకి
పండుగలేదు-పబ్బంలేదు-
దరహాసంలేదు-ఇతిహాసం లేదు." అని అంటున్న ప్పటికిని

"'మానవత' అనే 'కవిత'
సువర్ణాక్షరాలతో రాస్తున్నాను" అని అన్నారు.

"అనంత భ్రమణం" శీర్షికలో కవిత్వం గురించి ఇలా వ్యాఖ్యానిస్తున్నారు.

"—ఈ సరస్వతీ తీర సభా సీమలో
రాళ్ళు కవిత్వపు జవరాళ్లవుతాయి
ముళ్ళు విమర్శల చూపుడు వ్రేళ్ళయి లక్ష్యాలు
నిరూపిస్తాయి"
హిమాలయాలు మేఘసందేశాల్లో కరిగి ప్రవహిస్తాయి

కవుల గురించి చెప్తూ "అక్షర పరిమళం" శీర్షికలో ఇలా అంటారు.

"ఇది వరకు కవి రవి!
సమాజంలో చీకటిని తూర్పారబట్టే 'భారతి'!
ఇప్పుడుకవి - రవి కాదురవి-క!
పాలిండ్లకు అతుక్కు పోయే
ఆల్లిబిల్లి తలపుల నూలుపోగుల యవనిక!
అందుకే వీడు ఛా-రవికాదు పై-రవి!"

అయితే ఈ కవితకు ఉంచిన "శీర్షిక" మాత్రం సంతృప్తికరముగా లేదు.

ఈయన కవితలకు శీర్షికలను ఎంచుకొనుటలో తగిన జాగ్రత్తతీసుకొనట్టుగా అన్పిస్తుంది. ఒక్కొక్క కవితకు శీర్షికకు సంబంధము లేనట్టుగానూ తోస్తుంది ఉదాహరణకు ముక్తి, కిటుకు, తాళం మొదలగునవి.

కొన్ని కవితలలో అస్పష్టత, అసమగ్రతకు కూడా మనకు గోచరిస్తుంది. వీటికి నిదర్శనంగా మౌనాగ్ని బిందువులు, నిరూపణ, రవ్వలు, కిరణఖడ్గం, శాంతి మొదలగునవి చెప్పుకోవచ్చును. "రసాభాసం" కవితలో రసాభాసే ఎదురు అవుతుంది.

కొన్ని కవితల్లో వీరు చెప్పిన కొన్ని వాక్యాలు సూక్తులుగా పనికి వచ్చేటివిగానూ, పఠితలను ఆకర్షించే విధముగాను ఉన్నాయి. ఈ భావుకత, వాస్తవికతకు పరాకాష్టగా కూడా ఉన్నవి.

"చంద్రహాసమే నా హాసం!
నా గురువు ఈ ప్రభుత్వం!
నా కన్నీరు నా కవిత్వం!!" —"అగ్నిగానం"
ఇవే కవితల్లోని "చీకటి మెరుపులుగా" మెరుస్తాయి.

శ్రీ ఆచార్య తిరుమల కవితలు మొత్తానికి హృదయాన్ని అహ్లాదపరిచే విధముగా ఉంది, సులభమైన భాషలో సాగుతాయి. కాని సాహిత్య పిపాసకులు మాత్రము నిరాశపడక తప్పదు. ఈ కావ్యం డా॥ సి. నారెగార్కి అంకితము ఇచ్చారు. ఈ పుస్తకం కావలసినవారు రచయిత పేర "చైతన్య శిశాశాల, సుల్తాన్ బజార్, హైదరాబాదుకు" రాసి తెప్పించుకోవచ్చును. పుస్తకము వెల 10 రూ॥లు.

—టి. రంగస్వామి

* *

# వార్తావాహిని

## ఢిల్లీలో నన్నయ జయంతి

ఢిల్లీలో అంతర్జాతీయ తెలుగు సంస్థ (హైదరాబాదు), ఢిల్లీ ఆంధ్ర విద్యాసంఘం, ఢిల్లీ తెలుగు సారస్వత సమాఖ్య దక్షిణ ఢిల్లీ ఆంధ్ర సంఘం సంయుక్త ఆధ్వర్యాన, ఫిబ్రవరి 19, 20, 21 తారీకులలో ఆదికవి నన్నయ భట్టారకుని నవశత జయంత్యుత్సవాలు అతివైభవంగా జరిగినవి. 19 వ తారీకున Air Vice - Marshal సి. వి. యస్. సూర్యనారాయణరావు A. V S. M.గారి అధ్యక్షతన స్కూలు పిల్లల మధ్య నన్నయ పద్యాలపోటీ జరిగింది. అందులో 98 మంది తెలుగు పిల్లలూ, 22 మంది హిందీ పిల్లలూ పాల్గొన్నారు. వారిలో 35 తెలుగు పిల్లలూ, 12 హిందీ పిల్లలూ బహుమతులు గెల్చుకున్నారు. చిన్న చిన్నపిల్లలు ముఖ్యంగా హిందీ భాష పిల్లలు తెలుగులో నన్నయ పద్యాలు ముద్దుగా, కర్ణోపేతంగా వల్లిస్తుంటే వినటానికి చాలా ముచ్చటైంది.

ఫిబ్రవరి 20 వ తారీకున సాయంత్రం ఆంధ్ర విద్యాసంఘం ఆధ్వర్యంలో డా॥ బుర్రా వెంకటప్పయ్య I C S. (Retd) గారి అధ్యక్షతన సభ జరిగింది ముఖ్య అతిథిగా డా॥ బెజవాడ గోపాల రెడ్డిగారు సభనలంకరించారు. సభారంభంలో ఢిల్లీ ఆంధ్ర విద్యాసంఘపు పాఠశాలల ఉపాధ్యాయినులు కుమారి N C. త్రివేణిగారు, శ్రీమతి A. సర్వ మంగళ, శ్రీమతి ఉషారాణిగార్లు ప్రార్థనా రూపకంగానూ, మహాభారత ప్రశంసగానూ, భారతంనుంచి నన్నయకవి పద్యాలు చదివారు. తరువాత నన్నయను గూర్చిన ప్రశంసగా శిష్టా లక్ష్మీపతి శాస్త్రిగారిచే వ్రాయబడిన పద్యాలను శ్రీమతి A. సర్వమంగళ గారు చదివారు. అధ్యక్షోపన్యాసంలో డా॥ బుర్రా వెంకటప్పయ్యగారు ఇంతకుముందు పోతన, ఇప్పుడు నన్నయ, మహాకవుల స్మారకంగా ఇటువంటి ఉత్సవాలు ఆంధ్ర విద్యాసంఘం జరిపించటం ఒక అదృష్టమనీ, అందుకు తగిన ప్రోద్బలం అంతర్జాతీయ తెలుగు సంస్థ సమకూరుస్తున్నందుకు ఆ సంస్థ అధ్యక్షులు శ్రీ వందేమాతరం రామచంద్రరావుగారు ప్రశంసార్హులనీ, వాక్రుచ్చారు. డా॥ బెజవాడ గోపాల రెడ్డిగారు మాట్లాడుతూ, భారత రాజధాని ఢిల్లీలోని ఆంధ్రులు, ఆంధ్రప్రదేశపుటౌన్నత్యము, ఆంధ్ర సంస్కృతి, ఆంధ్రసారస్వతము ఔత్తరాహ్యుల కందిస్తున్నందుకు సంతోషం వెలిబుచ్చారు. అంతర్జాతీయ తెలుగు సంస్థ అధ్యక్షులు శ్రీ వందేమాతరం రామచంద్రరావుగారి అస్వస్థతవలన డా॥ గోపాలరెడ్డి గారు బహుమతి వితరణ గూడా చేశారు.

సభలో ఉపన్యసించిన వారిలో ముఖ్యులైన డా॥ దాశరథిగారు నన్నయ ఋషిత్వం గురించి మహాభారతం నుంచి అనేక పద్యాలను వివరించుతూ ఘనంగా ఉపన్యసించారు. ఆదికవి వాల్మీకితో తుల్యుడైన నన్నయగారు మహర్షి వ్యాసుని మించి భారతం ఆంధ్రలో సృష్టించారేగాని, కేవలం ఆంధ్రీకరించటం చెయ్యలేదన్నారు. తరువాతవారు ఢిల్లీ

తెలుగు సారస్వత సమాఖ్యవారి త్రైమాసిక సంచిక "సారసి"ని విడుదల చేశారు. పిదప డా॥ ఇల పావులూరి పాండురంగారావుగారు మాట్లాడుతూ, ముగ్గురు కవులచే, మూడు శతాబ్దాలలో, మూడు స్థలాలలో వ్రాయఁబడిన ఆంధ్ర మహాభారతం ఒక సమగ్రమైన పురుషార్థకోశమని వర్ణించారు.

సభ తరువాత అంతర్జాతీయ తెలుగు సంస్థవారి నాటక బృందం ఢిల్లీలోని ఔత్తరాహ్యులకు ఆంధ్రో న్నతి తెలియఁజేయఁబరిచేందులకు గాను హిందీలో, అద్భుతంగా అల్లూరిసీతారామరాజు నాటకం ప్రద ర్శించారు.

అంతకు పూర్వము, ఫిబ్రవరి 20 వ తారీకు మధ్యాహ్నం "తెలుగు సాహితి అధ్వర్యాన "భారత సారస్వతపు పునాదులు" అన్న శీర్షికపైన సమావేశం జరిగింది. డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు సమావేశా నికి అధ్యక్షత వహించారు. నన్నయ ఆదికవి గనుక వివిధ భాషలలో ఆదికవిత్వం గూర్చి వక్తలు ఉపన్య సించారు. డా॥ ఆర్ముగం (తమిళం) డా॥ అనుజన్ (మళయాళం) డా॥ కుమారి వినోదాబాయి (కన్నడం) డా॥ సత్కారి ముఖోపాధ్యాయ (బెంగాలీ) ఆంగ్లంలో ఉపన్యసించారు. హిందీ, తెలుగు భాషలలో కోవిదు లైన డా॥ జె. లక్ష్మీరెడ్డిగారు హిందీ కవిత్వం కృతుల గురించి తెలుగులో మాట్లాడారు. ఢిల్లీ యూని యన్ పబ్లిక్ సర్విస్ కమిషన్‌లో భాషా విభాగానికి డైరక్టరు డా॥ పాండురంగారావుగారు, హైదరాబాదు ఆల్ ఇండియా రేడియో వక్తలు డా॥ R. A. పద్మ నాభరావుగారు, నన్నయ కవిత్వం గురించి ధారాళంగా మాట్లాడారు.

21 వ తారీకున దక్షిణాంధ్ర ఢిల్లీ సంఘం ఆధ్వ ర్యాన కవిసమ్మేళనం జరిగింది. డా॥ బుర్రా వెంక టప్పయ్యగారి తొలిపలుకుల తర్వాత డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు మాట్లాడి, కవిసమ్మేళనానికి ఆరం భంగా తాము "ఆసియాడ్" గురించి వ్రాసిన పద్యాలు చదివి వినిపించారు. కవిసమ్మేళనంలో డా॥ దాశరథిగారుకాక, డా॥ ఇలపావులూరి పాండు రంగారావుగారు, డా॥ మహీధర నళినీ మోహనరావు గారు, డా॥ ఎ. అంజనేయులుగారు, శ్రీ ఏల్చూరి మురళీధరరావుగారు, శ్రీ శిష్టా లక్ష్మీపతి శాస్త్రిగారు, కుమారి N. C. త్రివేణిగారూ పాల్గొన్నారు.

కవిసమ్మేళనం తరువాత తెలుగు సినిమా 'పున ర్జన్మ' ప్రదర్శింపఁబడింది.

# కుసుమాంజలి

(ఢిల్లీలో జరిగిన నవళతి ఉత్సవంలో శ్రీశిష్టా లక్ష్మీపతి శాస్త్రిగారు చదివిన నన్నయ్య ప్రశంసా పద్యములు).

శా॥ శ్రీవాణీ గిరిజాధి నాథ విమలా శీర్వాద సంవర్థిత
ప్రావీణ్య ప్రతిభా ధురంధరత నాంధ్ర ప్రౌఢ ధారాళవా
గ్దేవీ దివ్య మరీచు లెల్ల దిశలన్ దీపింపఁగా జేసితే!
త్రైవిద్యాధిప! శబ్దశాసన! మహాత్మా! నన్నభట్టారకా!

ఉ॥ అమితాఖ్యానిక శాఖలన్ మధుర వేదార్థైక పుష్పోపగు
చ్ఛములన్ మోక్ష ఫలంబులన్ వెలసి, వ్యాస ప్రస్తుత ప్రాయమై
యమరున్ భారత పారిజాత; మదినీ వాంధ్రంబునన్ నాటితే!
క్షమతో మున్ను భగీరథుండిలకు గంగన్ తెచ్చినట్లో ఋషీ!

చం॥ బహుజన పాదపాద్ధి పశు పర్వత నిర్ఝర శోభితాంధ్ర భూ
వహం(డగు విష్ణువర్ధన నృపాలు తపస్సున సర్వవేద సం
గ్రహమగు భారతంబు రుచిరంబుగ నాంధ్రమునన్ రచించి, యీ
మహిని తెలుంగు భాషకు సమానము లేదని చాటితే, ఋషీ!

చం॥ అమరులు వల్కు భాషయని, యాది సరస్వతి సంస్కృత స్వరూ
పము వహియించి భారతము వ్యాసముఖంబున( బల్కెనంత వి
భ్రమమున శబ్దశాసన! భవద్రుచిరార్థ కవిత్వ వస్తుత
త్వమునకు ముగ్ధమై స్థిర నివాసము( జెందె తెలుంగు నేలపై.

ఉ॥ కూరిమి సత్యభామ సతికోపము(దీర్పగ( బారిజాతమున్
ద్వారక నామె కేళివని నాటెను గృష్ణుడు మున్ను; నే(డు భ
ట్టారక! పారిజాతము దృఢంబుగ నాంధ్రమునందు నాటితే!
భారత కావ్య రూపమున, వాఙ్మయవృద్ధి, జగద్ధితంబుగాన్.

సీ॥ గంగా తరంగిణీ రంగదుత్తుంగ త
రంగ భంగ క్షిప్ర రమ్యమొకట;
మందాకినీ శీత మంద వాయువిలోల
కలహంసి సందోహ గమన మొకట;
ఉల్లల దలకామ హోగ్రకల్లోలినీ
హల్లో హల ప్రవాహమున నొకట;
క్వణదుణు కింకిణీ కవిత కాంచన రణ
న్మణి నూపురాంచిత ధ్వనుల నొకట;

తే.గీ. ఆనిరర్గళ కవితా మహౌఘధార
ఆ ప్రసన్న కథా కవితార్థ యుక్తి
ఆ సమంచితా క్షరరమ్యతా సుధాబ్ధి
తెను(గు వాణికి నీవు పట్టిన నివాళి.

మత్తకోకిల.

పద్య విద్యకు సంస్కృతంబున వామలూరు తనూభవుం
డాద్యు(డైన విధంబు నాంధ్రము నందు నన్నయ భట్టనీ
వాద్యు(డై రుచిరార్థ యుక్తులనాంధ్ర భాషను ధారుణిన్
సద్యశః పరిపూత(జేసితే! శబ్దశాసన! ధీయుతా!

కవిరాజ విరాజితము.

అవరత హోమజపాహవ తత్పరు నంచితు నంచిత వేదవిదున్
వివిధ పురాణ విచక్షణు నాంధ్ర కవిత్వ విధాన విధాయకు స
త్యవచను మర్త్యమరాధిపునొజ్ఞ మహత్తరలోక వివేకి ఋషి
ప్రవరుని వాగను శాసనునన్నయభట్టునుతింతు నిరంతరమున్.

కం॥ లోకజ్ఞ ! శబ్దశాసన!
లోకాగమ బద్ధ నియమలోల! మహర్షీ!
కైకొను మీ కుసుమాంజలి,
నాకా చార్యాతి ధిషణ! నన్నయ్యభట్టా! ★

## హిందీ విజయపత్ర వితరణోత్సవము. హైదరాబాదు

విద్యార్థుల ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని త్రిభాషా సూత్రాన్ని అమలుచేయాలన్న కృత నిశ్చయంతో తమప్రభుత్వంఉందని ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు గౌ. శ్రీ పి. ఆనందగజపతిరాజు గారు స్పష్టం చేశారు. తెలుగు భాషకు ఎంత ప్రాధాన్యం లభిస్తుందో అంతే ప్రోత్సాహాన్ని హిందీ, ఇంగ్లీషు భాషలకు యివ్వడం జరుగుతుందని, ఆయన హామీ యిచ్చాడు.

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర నిర్వహించిన వివిధ పరీక్షలలో ఉత్తీర్ణులయిన వారికి యోగ్యతా పత్రాలను అందజేసే కార్యక్రమంలో శ్రీ ఆనంద గజపతి రాజుగారు ప్రధాన అతిధిగా పాల్గొన్నారు. హిందీ భాషను ప్రోత్సహించే విషయంలో ఎదురౌతున్న యిబ్బందులను త్వరలోనే పరిష్కరించగలమని ఆయన చెప్పారు. విద్యార్థులు మొదట మాతృభాషను పరిపూర్ణంగా నేర్చుకోవాలని, ఆ తరువాత ఇతర భాషలను తెలుసుకొనేందుకు కృషి చేయాలని శ్రీఆనంద గణపతి రాజుగారు సూచించారు. సభకు అధ్యక్షత వహించిన పంచాయతీరాజ్ శాఖామాత్యులు శ్రీ కరణం రామచంద్రరావు గారు హిందీ భాషాభివృద్ధికి దక్షిణ భారత హిందీ ప్రచార సభ జరుపుతున్న స్వచ్ఛంద కృషిని అభినందించారు. తెలుగుతో పాటు హిందీని కూడా మన విద్యార్థులు నేర్చుకోవాలని ఆయన కోరారు.

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర అధ్యక్షులు శ్రీ శీర్ల బ్రహ్మయ్యగారు. ప్రచార సభ ప్రత్యేక అధికారి శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి గారు మాట్లాడుతూ దక్షిణ భారత దేశంలో హిందీ ప్రచారము యొక్క ప్రాముఖ్యతను తెలిపిరి.

హిందీ ప్రేమీ మండలి అధ్యక్షులు శ్రీ చవాకుల నరసింహమూర్తి సభ ప్రారంభంలో గౌరవనీయులు శ్రీ విద్యామంత్రి. శ్రీ పంచాయతీరాజ్ మంత్రిగారికి తదితర అతిథులకు స్వాగతం పలికిరి. మండలి పక్షమున నిర్వహించుచున్న ఉచిత హిందీ తరగతుల గురించి వివరించిరి. ప్రేమీమండలి కార్యదర్శి శ్రీ యం. ఆదినారాయణగారి వందన సమర్పణతో సభ ముగిసినది.

## రేపల్లెలోని ఆదర్శ హిందీ విద్యా మండలి 11వ వార్షికోత్సవము

ది. 20 2.83వ తేదీ ఆదివారం సాయంకాలం 4 గంటలకు రేపల్లె హిందీ ప్రేమీమండలి ఆధ్వర్యాన నడుపబడుచున్న ఆదర్శ హిందీ విద్యా మండలి 11వ వార్షికోత్సవము శ్రీ చింతల పూడి కుసుమ హరనాథ శర్మ, గుంటూరు జిల్లా ప్రచారక మండలి కార్యదర్శి గారి అధ్యక్షతన జరిగినది. ముఖ్య అతిథిగా శ్రీ అన్నాప్రగడ లక్ష్మి నారాయణ B com. (Hous) A.P.E.S. విచ్చేశి విద్యార్థులకు విజయ పత్రముల నొసంగిరి. ముఖ్య అతిథిగారి ఉపన్యాసములో హిందీ విద్య నభ్యసించవలశిన యవసరమును, భారత దేశములోని రాష్ట్రములలోని భాషలన్నింటికి అనుబంధ భాషగా హిందీ భాష యొక్క ప్రాధాన్యమును నొక్కి వక్కాణించిరి. పలువురు వక్తలు రేపల్లెలో హిందీ ప్రచారము జరుగుచున్న సరళిని, హిందీ భాషకై శ్రీమతి పొన్నవల్లి లక్ష్మిగారు నిస్వార్థముగా చేయుచున్న కృషికి కొనియాడిరి, శ్రీ పి. వి. జి. కృష్ణమూర్తిగారు వందన సమర్పణచేశిరి. సభానంతరం సాంస్కృతిక కార్యక్రమములు జరిగినవి. సభ దిగ్విజయముగా ముగిసినది.

## ప్రముఖ హిందీ పండితులు శ్రీ వేమూరి సుబ్బారావు గారి పదవీ విరమణ వీడ్కోలు సన్మానసభ., మదనపల్లె

చిత్తూరు జిల్లాలో 32సం॥ వివిధ జిల్లా పరిషత్ హైస్కూళ్ళలో పని చేసి కీర్తిగడించి, ఎక్కువ

సంఖ్యలో హిందీ పండితులను విద్యార్థులను తయారు చేసిహిందీప్రచార అభివృద్ధికి పాటుపడి శ్రీసుబ్బారావు గారు పదవీ విరమణ చేసిరి

పై సందర్భమున 1-3-83 గోళ్ళపల్లి పరిషత్ హైస్కూల్ ఆవరణలో బ్రహ్మాండమైన సభ జరిగెను. హైస్కూల్ ప్రధానోపాధ్యాయులు శ్రీ జి చిన్నబ్బ నాయుడు M.A., B Ed అధ్యక్షత వహించిరి. అధ్యక్షులు సుబ్బారావుగారి అకుంఠిత దీక్ష గురించి పూడ్చలేని లోటు స్కూలుకు ఏర్పడినదని ఉపన్యసించిరి. తదుపరి శ్రీ వెంకటరమణారెడ్డి B.Sc. B.Ed, శ్రీ J. నారాయణ B.A, B.Ed. శ్రీ నారాయణశెట్టి B.A.B Ed. శ్రీ వీరభద్రయ్యగారు స్కూలు విద్యార్థిని, విద్యార్థులు సుబ్బారావుగారి సేవలను ప్రశంసించిరి.

ప్రధానోపాధ్యాయులు శ్రీ చిన్నబ్బనాయుడు గారు ఉపాధ్యాయుల తరపున, విద్యార్థుల తరపున నూతన వస్త్రములతో సుబ్బారావుగారిని సత్కరించిరి. విద్యార్థులు బహుమతుల నొసంగిరి.

సన్మానితులు సుబ్బారావుగారు తమ సన్మానానికి కృతజ్ఞతలు తెలుపుకొనిరి.

శ్రీ గంగులురెడ్డిగారి వందన సమర్పణతో సమావేశము జయప్రదముగా ముగిసినది.

## హిందీ మహా విద్యాలయం-విజయవాడ

దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆధ్వర్యమున నడుస్తున్న హిందీ మహా విద్యాలయ సత్రాంతోత్సవం 23-2-83వ, తేదీ మధ్యాహ్నము మాచవరంలోని ప్రచారక్ ట్రైనింగ్ స్కూలులో, ద. భా. హిందీ ప్రచార సభ ఆంధ్రశాఖ కార్యదర్శి సి. హెచ్. సుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతన జరిగింది.

మహా విద్యాలయం ప్రిన్సిపాల్ కాజ వెంకటేశ్వర రావుగారు శ్రీ చిర్రావూరి సుబ్రహ్మణ్యం గారికి శ్రీ రాధాకృష్ణ జోషీగాగారికి స్వాగతం చెప్పి ముఖ్య అతిథులను పరిచయం చేశారు.

శ్రీ సుబ్రహ్మణ్యం గారు మాట్లాడుచూ ఆంధ్ర ప్రదేశ్‌లో, ముఖ్యంగా విజయవాడలో హిందీ అభ్యసించటంలో, విద్యార్థినీ విద్యార్థులు కనబర్చే అభిరుచి హర్షించదగినవని కేవలం ప్యాసు కావటమే ప్రధానంగా భావించక, ఉత్కృష్టమైన విద్య నార్జించటానికి ప్రయత్నించవలసిందిగా, కోరుచు బాలబాలికల నాశీర్వదించిరి.

ముఖ్య అతిథి శ్రీ రాధాకృష్ణ జోషీగారు ఉపన్యసించుచూ సామాజిక అవసరాలకు అనుగుణంగా మన విద్యా విధానమును కూడ మలచుకుంటూ మానవుడు ముందుకి పోవాలనియు, అన్యులకు ఆదర్శంగా జీవించవలయునని ఉద్బోధించిరి.

ప్రచారక విద్యాలయం ప్రిన్సిపాల్ శ్రీ M. సుబ్బారావుగారు, Y. సీతారామయ్యగారు. శ్రీ P. ప్రసాదరావుగార్లు కూడ సభలో పాల్గొని విద్యార్థుల నాశీర్వదించిరి.

అనంతరం ప్రవేశిక పరీక్షలో ప్యాసైన విద్యార్థులకు అధ్యక్షులు శ్రీ సుబ్రహ్మణంగారు సర్టిఫికెట్స్ అందజేసిరి.

ఉపాధ్యాయని శ్రీమతి Ch. కామాక్షిగారు అభివందనములు సమర్పించగా, "జన గణ మన"తో సభ సమాప్తమైనది.

## మొవ్వలో ఆరవ హిందీ పరీక్షార్థుల మేలా

ది. 13-2-83 ఆదివారము ఉదయము గం. 10-00లకు, స్థానిక హిందీ ప్రచారక్ శ్రీ కె. ఆర్. కె. శర్మ సంచాలకత్వములో మొవ్వ జిల్లా పరిషత్ హైస్కూలు ఆవరణ అనేక మంది హిందీ విద్యార్థినీ-విద్యార్థులతోను, హిందీ ప్రచారికా, ప్రచారకులతోను కళ కళ లాడినది. కార్యక్రమము చిరంజీవి తుమ్మల సాయిగోపాల్ ప్రార్థనా గీతముతో ప్రారంభమైనది. ఈ కార్యక్రమములో దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు వారిచే నిర్వహించబడు ప్రాథమిక,

మధ్యమ, రాష్ట్రభాష, ప్రవేశిక, విశారద పూర్వార్థ మరియు విశారద ఉత్తరార్థ పరీక్షల విద్యార్థినీ-విద్యార్థులను వేరు వేరు తరగతులలో కూర్చుండబెట్టి పరీక్షా సంబంధమైన ప్రత్యేక తరగతులు నిర్వహించబడినవి.

ఈ కార్యక్రమములో కాజ, కోసూరు, కోసూరు-పాలెం, వేములమడ, మొవ్వపాలెం, మొవ్వ, కూచిపూడి, పెడసనగల్లు, పెనుమత్స, గూడపాడు, కొడాలి, చల్లపల్లి మొదలగు చుట్టు ప్రక్కల గ్రామముల నుంచి సుమారు 200 మంది హిందీ పరీక్షార్థులు హాజరైరి

కార్యక్రమములో పాల్గొనిన హిందీ ప్రచారికా ప్రచారకులు :

విజయవాడ :- సర్వశ్రీ మిక్కిలినేని సుబ్బారావు, కాజ వెంకటేశ్వరరావు, పిన్నమనేని ప్రసాదరావు
గుంటూరు :- శ్రీ కంభంపాటి సత్యన్నారాయణమూర్తి
గుడివాడ :- సర్వశ్రీ ఎన్. ఎస్. ఎన్. అప్పలాచార్యులు, డి.బి ఎన్.ఎస్. శ్రీనివాస్, పి వి. భద్రకాళి మరియు లక్ష్మి
చల్లపల్లి :- శ్రీ ఉప్పాల వెంకటేశ్వర్లు
కొడాలి :- శ్రీ కె నాగేశ్వరరావు
కాజ:- శ్రీ జి. దుర్గా ప్రసాదరావు
ఘంటసాల :- శ్రీ కోట వెంకటప్పయ్య శాస్త్రి
పెడసనగల్లు :- శ్రీ కె. కృష్ణారావు
కూచిపూడి :- శ్రీమతి పి. ఎమ్. రమ
అవనిగడ్డ :- శ్రీ జోస్యుల సూర్య నారాయణ మూర్తి

ఈ సందర్భంలో తేనేటి విందు, ప్రమాణ పత్ర వితరణోత్సవం, బహిరంగ సభ మొదలుగు గల కార్యక్రమాలు విజయవంతంగా జరిగినవి. రాజకీయ రంగంలోను, విద్యారంగంలోను పనిచేస్తున్న పెద్దలు చాలా మంది పై కార్యక్రమాల్లో పాల్గొన్నారు. హిందీ పండితులు శ్రీ కె. కె. శర్మగారి కృషిని అంతాశ్లాఘించారు.

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర, హైదరాబాదు.

ది. 2,3 ఏప్రిల్ 1983నాడు దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర శాఖకు సంబంధించిన వర్కింగ్ కమెటీ, గవర్నింగ్ బాడీ, తదితర ఉపసమితుల సమావేశాలు జరిగాయి. 1983-84 సంవత్సరానికి బడ్జెటు మొదలుగా గల అవసరమైన వివరాలపై సమావేశాలలో నిర్ణయాలు గైకొనబడినవి కేంద్ర ప్రభుత్వ ఆర్థిక సహాయంతో నడుస్తున్న ప్రణాళికలు కూడా అమలు జరచుటకు నిర్ణయాలు చేయబడినవి. ఆంధ్ర ప్రదేశ్‌కు చెందిన వివిధ కేంద్రాల నుంచి అనేక మంది మెంబర్లు వచ్చి పై సమావేశాలలో పాల్గొన్నా . సమావేశాలన్నీ విజయవంతంగా జరిగినవి.

## శ్రీ శీర్ల బ్రహ్మయ్య, చిర్రావూరి గారలకు సన్మానం

ది. 3 ఏప్రిల్ 1983 సాయంత్రం 4 గంటలకు దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర హైదరాబాదు భవనంలో ఆంధ్ర సభ అధ్యక్షులు శ్రీ శీర్ల బ్రహ్మయ్య, మాజీ కార్యదర్శి, ప్రస్తుత కేంద్ర సభ పరీక్షా మంత్రి శ్రీ చిర్రావూరి సుబ్రహ్మణ్యంగారల చిత్ర పటావిష్కరణ, సన్మాన సభ శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారి అధ్యక్షతనవిజయవంతంగా జరిగినది. అఖిల భారత హిందీ సంస్థా సంఘ్ అధ్యక్షులు శ్రీ గంగాధర్ శరణ్ సిన్హా. కాశీనాగరీ ప్రచారిణీ సభ ప్రధాన కార్యదర్శి శ్రీ సుధాకర్ పాండే ఎం పి. గారలు ప్రత్యేకించి యీ సభలో పాల్గొనడం విశేషం.

శ్రీ మండలి కృష్ణారావు, గంగా బాబు, సుధాకర్ పాండే, శీర్ల బ్రహ్మయ్య, చిర్రావూరి సుబ్రహ్మణ్యంగారలకు ఆంధ్ర సభ పక్షాన నూతన ఖాదీ వస్త్రాలతో సన్మానోత్సవం జరిగింది. శ్రీ మండలి వెంకట కృష్ణారావు శ్రీ శీర్ల, చిర్రావూరి గారల చిత్రపటావిష్కరణ కావించారు: గంగాబాబు, సుధాకర్ పాండే, చవాకుల నరసింహమూర్తి గారలు ప్రసంగిస్తూ సన్మానితులకు ఆశీస్సుల నందజేశారు. శ్రీ శీర్ల, చిర్రావూరి గారల సమాధానం తరువాత శ్రీ బోయపాటి నాగేశ్వరరావు గారి ధన్యవాద సమర్పణతో సభ సమాప్తమైనది,





ఆంధ్ర శాఖ అధ్యక్షులు శ్రీ శీర్ల బ్రహ్మయ్య, హైదరాబాదు హిందీ ప్రేమీ మండలి అధ్యక్షులు
శ్రీ చవాకుల నరసింహమూర్తి, శ్రీ రాధాకృష్ణమూర్తి గారలు ప్రసంగిస్తున్నారు.



అఖిలభారత సంస్థా సంఘ్, అధ్యక్షులు శ్రీ గంగాశరణసింహ ప్రసంగిస్తున్న దృశ్యం.



శ్రీ శీర్ల బ్రహ్మయ్య చిరావూరి సుబ్రహ్మణ్యంగారల చిత్రపటావిష్కరణ కావించిన
శ్రీ మండలి వెంకటకృష్ణారావు గారు, ప్రక్కన రాధాకృష్ణమూర్తిగారు గలరు.



కాశీనాగరీ ప్రచారిణీ సభ ప్రధాన కార్యదర్శి శ్రీ సుధాకర్‌పాండే ఎం.పి. గారిని
దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర భవనంలో జరిగిన మహాసభలో
శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు సన్మానిస్తున్న దృశ్యం.

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు

ది. 21 మే 1983 శనివారం మధ్యాహ్నం 11 గంటలకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసులో పదవీదాన సమారోహ్ జరుగును. భారత రాష్ట్రపతి గౌ॥ జ్ఞానీ జైల్‌సింగ్ హిందీ డిగ్రీల నొసంగి సందేశం యిచ్చుటకు అంగీకరించి మద్రాసు వస్తున్నారని తెలుపుటకు సంతోషిస్తున్నాం.

— ప్రత్యేక అధికారి

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ,-ఆంధ్ర, హైదరాబాదు
# స్వర్ణోత్సవాలు-1986

1936లో ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘం పేరిట స్థాపించబడి ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్రగా రూపొందించబడిన ఆంధ్ర శాఖకు 1986 లో స్వర్ణోత్సవాలు పెద్ద స్థాయిలో జరుపవలసి యున్నది. 1963 లో కీ॥ శే॥ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి అధ్యక్షతన ఆంధ్ర సభ రజతోత్సవాలు ఘనంగా జరిగిన విషయం సర్వుల విదితమే. త్వరలోనే స్వర్ణోత్సవ కార్యక్రమాలు నిర్ణయించబడతాయి.

మీ అందరి సహకారాన్ని అర్థిస్తున్నాము.

వేమూరి రాధాకృష్ణమూర్తి
ప్రత్యేక అధికారి
దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర

శీర్ల బ్రహ్మయ్య
అధ్యక్షులు
దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర



ది. 3-4-83న జరిగిన దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర శాఖ వ్యవస్థాపికా సమితి సమావేశానికి అధ్యక్షత వహించిన శ్రీ శీర్ల బ్రహ్మయ్యగారు ప్రసంగిస్తున్న దృశ్యం. ప్రక్కన కుర్చీలలో శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి, ఎం. వి. పాపన్న గుప్త టోకర్సీలాల్ కాపడియా, రాధాకృష్ణ జోషీ, గోలి ఈశ్వరయ్యగారలు గలరు.

Edited, Printed and Published by V. Radhakrishna Murty, on behalf of the B D Hindi Prachar Sabha-Andhra, 959, Khairatabad, Hyderabad-500 004.
and Printed at Dakshina Bharat Press, Hyderabad-500 004.